# స్వయంకృషి

## (ఆత్మకథ)

## శ్రీ మండలి రాజగోపాలరావు

శ్రీ మండలి రాజగోపాలరావు దంపతులు,
పులిగడ్డ, కృష్ణాజిల్లా.



# ముందుమాట

శ్రీ మండలి రాజగోపాల రావు S/O. లక్ష్మయ్య పులిగడ్డ రచించిన వారి స్వీయచరిత్ర చూచె అదృష్టము నాకు లభించినది వారు నాతో పాటు 1977లో దివిసీమ తుఫానులో కలిసి పనిచేసారు వారి స్వీయచరిత్ర చదివినప్పుడు ఆ నాటి దృష్యాలు అనుభవాలు నా కంటి ఎదుట ప్రతిబింబించినది ఆ ఆప్యాయత ప్రజాజనంతో వారు ఆ నాటి బాధితులతో కలిసి పనిచేయడం నన్నెంతో ఆనంద పరిచినవి. ఈ గ్రందములో వారి పూర్వపు వంశ చరిత్ర పొందు పరచబడినది. రాచరికమునుండి పేదరికము అడుగంటిన స్థాయిని చవిచూచినవారి కుటుంబ వ్యవహారములు సహజంగా వేరువేరు కష్టసుఖాలను అనుభవాలను ఈ స్వీయచరిత్రలో కనబడడం వారి వ్యవహారాలలో ప్రకాశము పంతులుగారు న్యాయవాదిగా పనిచేయడం చెప్పుకోదగ్గది ఈ ఘట్టము వారి కుటుంబ నీతిని త్యాగాన్ని గుర్తింపుకు సాక్ష్యం. వారు రెవెన్యూ అధికారిగా రిటైరైనారు. విద్యాభోధన వారి వృత్తితో పాటు అదిప్రవృత్తి కూడాను అందుకే వారి చిత్తసుధ్ధితో నేర్పిన విధ్య వల్ల పలువురు చాలాగొప్ప స్థాయిలో ఉద్యోగాలు చేసి రిటైరైనారు. అందులో చెప్పుకోదగ్గవారు చాలామంది ఉన్నారు. అందు రాఘవరావు అనువారు అసిస్టెంట్ సెక్రెటరీగా ఫైనాన్సు డిపార్టుమెంటులో పని చేసి రిటైరైనారు. ప్రస్తుతము జాయింటు సెక్రెటరీగా సని చేయు చున్న జి.ఎల్.వి. ప్రసాదరావు, ఒకరు వీరి ఆశయములకు అనుగుణ్యంగా గాంధేయతత్వముంది. దానిని వారవలంభించారు స్వీయచరిత్రలో గాంధీగారిని 1946లో స్వయంగా దర్శించుకొని ఆశీసులు పొందిన ఘట్టమున్నది. ఇలాగే చదువరులకు ఆసక్తికరమైన అనేక అంశములు ఈ గ్రంధమందు కనపడును అన్నిటికన్న 1977లో తుఫానులో మండలి కృష్ణారావు వారి సతీమణి ప్రభావతీ దేవి వారి కుమారులు బుద్ధ ప్రసాద్, లవణం దంపతులు జయసింహాచారి వారలతో కలిసి పునరావాస కార్యక్రమం జయప్రదంగా నడిపిన ఘట్టాలు నేనెరుగుదును. కమ్మన మోలు (గాంధీ గ్రామం) గ్రామ నిర్మాణము చేసినప్పుడు వారు నాతో కలిసి పనిచేసిరి. ఇది ఆరోజులలో చెప్పుకోదగ్గ

అంశము. గాంధీ గ్రామములోని హౌస్ కమ్ షెల్టరు ఒక ఆదర్శ నిర్మాణము. నిర్మాణ ఆశయ స్థితిని జయప్రదం గానించుటలో వారు ఎంతేని తోడ్పడియున్నారు. వారు ప్రస్తుతము 80ఏళ్ళ వయస్సు దాటి 81వ సంవత్సరములో ప్రవేశించుటలో ఎలాంటి అపేక్షలేని దశలో ఈ స్వీయ చరిత్ర వ్రాయడం ఎంతో శ్లాఘనీయం వారు ఇదే ఉత్సాహముతో 120 సంపత్సరాలు జీవించి ప్రజలకు ఉపయోగకరముగా నుండు శక్తిని కల్పించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

ఎమ్.ఎస్. రాజలింగం

బి.యస్.సి., ఎల్.ఎల్.బి.

ఫ్రీడం ఫైటర్ 4

Ex Minister

తేది ॥ 22-8-2001

డోర్ నం. 1-1-336/8,

చిక్కడపల్లి,

హైదరాబాదు - 20.

# ప్రస్తావన

1977 నవంబరు 19వ తేదిన జరిగిన ఉప్పెన తుఫానుకు గురైన దివిసీమ ప్రజలకు గాంధీక్షేత్రములో అప్పటి విద్యామంత్రి దివంగత మండలి వెంకట కృష్ణారావుగారి ఆధ్వర్యములో రోజుకు షుమారు పదివేల మందికి అన్నదానము చేయడమైనది. ఆ సమయములో నేను  గాంధీక్షేత్రము మేనేజరుగా ఉండి ఈ కార్యక్రమాలన్నిటిలోను భాగస్వామిగా పనిచేసినప్పుడు జ్ఞాపకం వచ్చినది. మానాన్నమ్మ దివంగత మండలి దుర్గాంబ W/O కేశవరాయుడుగారు యిలాగ 1903 సం. లో కృష్ణానదికి యిండ్లమీది నుండి వరదనీరు ప్రవహించినది. అందువల్ల దిగువ గ్రామాలలోని ప్రజలందరు కట్టుబట్టలతో మెరక గ్రామమైన పులిగడ్డచేరగా వారికి 3 రోజుల పాటు మా సంస్థానము భోజన సదుపాయములు చూచినదని చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చి నేను నా ఆత్మకథ ద్వారా తెలియచేద్దామనుకున్నాను. మరికొంత మంది పూర్వపు సంఘటనలు కొన్ని చెప్పగా తోటి అనుచరుల వత్తిడి వల్ల నేను నాఆత్మకథ వ్రాయుటకు మరికొంత సమాచారాన్ని సేకరించి ది ॥ 29-11-2001 విదియ సోమవారం వ్రాయడం మొదలుపెట్టి వ్రాసి ముద్రించి ది॥ 30-8-2001న నా 81వ జన్మదినమునాడు ఒక పెద్ద త్యాగధనులు శ్రీ తుర్లపాటి కుటుంబరావు చే విడుదల చేయ సంకల్పించితిని.

నేను అనేక సమయాల్లో అనేక ప్రయోగాలు చేసాను. అవన్ని సత్యము స్వయంకృషిని, తెలియజేస్తాయి. వాటిని వ్రాసి పుస్తకరూపంలో ప్రజల ముందుంచితే యెంతో మేలు కలుగుతుందని నా విశ్వాసము. ఒక రోజు ఒక క్రైస్తవ ఫాదరీ అతని శిష్యగణంతో మాయింటికి సుమారు సాయంత్రము 7-8 గం ॥ మద్య వచ్చి మీరు బాగా చదువుకున్నవారు, ఎంతో మంచివారని విన్నాను. మీరు క్రైస్తవ మతమును స్వీకరిస్తే మరింత వెలుగులోకి వస్తారని అనగా, నేను మీ బైబులు చదివాను అందు మొదటి వాక్య " He who followeth me walketh not in darkness " అని ఉంది. నేను సత్యాన్నే నమ్ముకొని స్వయంకృషితో జీవిస్తున్నాను. నాకిప్పుడే కొదువాలేదు. నాకా సత్యసంధతే ఆత్మబలాన్నిచ్చి నన్నింత ఆరోగ్యవంతునిగా నిలబెట్టినదని భావిస్తున్నాను. ఆ సత్యసంధత కంటే మేలైన దేదైనా ఉన్నదంటే మీ క్రైస్తవ మతమును స్వీకరిస్తాననగా

మారుమాట్లాడకుండా వారు వెళ్లిపోయిరి. అయితే నాప్రయోగాలు ధర్మం అంటే నీతి. ఆత్మదృష్టిలో చిన్నలు, పెద్దలు, యవకులు, వృద్ధులు, స్త్రీలు నిర్ధారించగల విషయాలు యీనా ఆత్మకథలో ఉంటాయి. నాయీ కథ పూర్తిగా వ్రాయగలిగితే ధర్మబద్ధ మార్గాన పయనించి ప్రయోగాలు చేసే వారందరికి కొంత ఉత్తేజం లభిస్తుందని నావిశ్వాసము. నేను ఉద్యోగముచేసే రోజులలో IAS ఆఫీసరు శ్రీ R.K.R. Gonel గారి వద్ద వారు 30 రోజుల తహసిల్‌దార్ ట్రైనింగులో ఉండగా పనిచేశాను. వారిని నేను దివితాలూకా పెన్షనీర్సు అస్సోసియేషన్ ప్రశిడెంటుగా రివిజన్ ఆఫ్ పేస్కేల్సు ఆఫ్ ఫిఫ్తు పేకమీషన్ ఛైర్మన్ ముందు 1997లో తిరిగికలిశాను. వారు నన్నుచూడగానే రాజగోపాలరావు మిమ్మల్ని 1964 లో చూచినప్పుడు ఎలాఉన్నారో యిప్పుడు కూడా అలాగే ఉన్నారు. కాని రిటైరైనా మార్పు లేదన్నారు. అది నాతల్లిండ్రుల ఆశీర్వచనం అన్నాను. అదేమోనాకు తెలియదుగాని నీ సత్యసంధతే నిన్నింత ఆరోగ్యంగా ఉంచినదని శ్లాఘించారు. తరువాత నేను మరొక జిల్లా యస్యూరెన్సు రిజష్ట్రారు శ్రీ మాదరాసు రామస్వామి గారితో 4,5 సంవత్సరముల పరిచయం ఉండియున్నది. అందుకు గాను వారు ఏదోసందర్భములో మీ వద్ద ఏకోశాన అబద్ధము లేదండి అని అన్నారు. ఆది మీబోటివారికి తెలియవలసిందేగాని నాకుతెలియదన్నాను.

జీవితమనేది కత్తిమీద సాముచంటిది, సత్యాన్నే ఆధారంగా చేసుకొని స్వయం కృషిచేశాను. ఆమార్గాన నడుస్తున్నప్పుడు నాకు తెలిసినంత వరకు ముందుకే సాగాను. నేను పేర్కొన్న ప్రయోగాలను దృష్టాంతాలుగా భావించి అంతా తమతమ శక్త్యానుసారము తమకుతోచిన విధముగా చేయాలని కోరుచున్నాను. Life is mixed with a little pleasure and a plenty of sorrows. నాగుణగణాలను శ్లాఘించుకోవాలనే కోరిక నాకు లేశమైనా లేదు. నా ఆత్మకథ వల్ల ఎదో కొంత ప్రజలకు లభించగలదని విశ్వసిస్తునాను.

ఇక ముగిస్తున్నాను

పులిగడ్డ

మండలి రాజగోపాలరావు

ది. 1-5-2001

# స్వీయ చరిత్ర

మండలి రాజగోపాలరావు తండ్రి లక్ష్మయ్య స్వాతంత్ర్య సమర యోధులు.

| | |
|---|---|
| గోత్రము | గందపాల |
| జననం | 30-8-1921 |
| స్వస్థలం | పులిగడ్డ - అవనిగడ్డ మండలం - కృష్ణాజిల్లా<br>ఆంధ్రప్రదేశ్ - 521121 |

**1. పులిగడ్డ, దానికాపేరు :–** పూర్వము 13,14 శతాబ్దముల వరకు సముద్రము (బంగాళాఖాతము) నీరు తగ్గగా తేలిన విస్తీర్ణములో ముండ్ల పొదలు, చెట్లు చేమలు, పాములు వగైరాలతో నిండి ఉండెడిది. ఈ గ్రామము కృష్ణానది ముఖ్యద్వారములో బంగాళాఖాతమునకు సుమారు 15-16 కిలోమీటర్ల దూరములో ఉండియున్నది. ఈ కృష్ణానదికి ఉత్తరాన కృష్ణాజిల్లా, పడమరన గుంటూరు జిల్లాలు ఉండియున్నవి. అప్పట్లో గుంటూరు జిల్లా పెనుమూడి గ్రామము నుండి నదీపాయను దాటి పశువులను మేపుకొనుట కొద్దికొద్దిగా వ్యవసాయము చేయుట సాగించి ప్రొద్దుగ్రుంకే సరికి ఈ నదీ పాయ దాటి పెనుమూడి వగైరా గ్రామాల్లో స్థిర నివాసమేర్పరుచుకొని జీవించెడి వారనిన్ని. కొంత కాలమునకు పై అడవులలో నుండి ఒక పులి తప్పించుకొని వచ్చి ఇచ్చట మనుష్యులు పశువులు తిరుగాడుట పసిగట్టి ఇచ్చటనే ఉంటూ ఉండేదట. ఆ రైతులకు వ్యవసాయపు పనిముట్లు అందించుటకు గాను ఒక విశ్వకర్మ కూడా భర్యాబిడ్డలతో పగలు ఈ లంకలో ఉండేవాడనిన్ని, ఒకనాడు ఆ వడ్రంగి భార్యకు అకాల ప్రసవ వేదన హఠాత్తుగారాగా ఆమెను అచ్చట నుండి తరలించడానికి వీలుకాక అ యింటిలో (రెల్లు చువ్వతో దట్టముగా కట్టి మిట్ట వేసిన యిల్లు) వదలి పులివస్తే చేయమనిన ఉపాయము చెప్పి వెళ్ళిపోయిరట. ప్రొద్దుగ్రుంకగానే ఆ పులి నరవాసనను బట్టి ఓ యింటికి వచ్చి

చుట్టూ తిరిగి తిరిగి తలుపు వద్ద గోడకు చిన్న కన్నము పెట్టి తల లోపలకు దూర్చగా ఆ యిల్లాలు ఎలాగో చావు తప్పదని గ్రహించి ప్రక్కనే ఉన్న పదునైన బాడితతో మెడమీద వేయగా ఆ పులి గాండ్రు మంటూ అరిచి చని పోయినదట. ఆ రాత్రీ ఆ ఇల్లాలు ప్రసవించి మగపిల్లవానికి జన్మనిచ్చినదట.

మరునాడు ఆ రైతులంతా రాత్రి ఏమి జరిగినదో తెలుసుకొనుటకు ఆతురతతో రాగా చచ్చిపడిఉన్న పులిని చూచి తలుపు తీసుకొని వచ్చి ఆ బాలింతను బాలుని చూచి సంతోషపడి పులిబాధ విరగడైనందుకు ఆమె ధైర్యసాహసాలకు అబ్బురపడి ఆమెను బిడ్డను సత్కరించి ఆనాటి నుండి అచ్చటనే ఇళ్ళు కట్టుకొని రాత్రింబవళ్ళు ఆ గడ్డమీదనే కాపురముంటూ సేద్యము చేసుకొని జీవయాత్ర సాగిస్తూ ఇది పులి నివసించిన గడ్డ కనుక ఈ గడ్డకు పులిగడ్డ అని నామకరణము చేసినారట. తదువరి కొంతకాలానికి ఆ గ్రామములో వరుసగా 3,4 సంవత్సరాలు వర్షాభవము చేత పంటలు పండక పోవుట వల్ల రైతులంతా మనము పులిని చంపినందు వల్లే ఆ పాపానికి ప్రాయశ్చితంగా పంటలు పండడం లేదని ఈ గ్రామము విడిచి పరిసర గ్రామాలకు వెళ్ళి పశువులను మేపుకుంటూ వ్యవసాయము చేసుకొని జీవించినట్లు వినికిడి.

## (2) మండలి వంశ వర్ణన :-

ఇలా ఉండగా మైసూరు రాష్ట్రాన్ని పాలించే రాజు కువమ్మరనిన్ని వాని ప్రభుత్వములో మెండు, మండలి, బండ్రెడ్డి, భోగాది అను ఇంటి పేర్లు గల కాపుకులస్థులు వీళల్లో కొంతమందిది వ్యవసాయ వృత్తికాగా కొంతమంది మైసూరు మహారాజా వారి కొలువులో సైనికులు, మంత్రులు వగైరా ఉద్యోగులు. మరి మండలి చినపోతినీడునాల్గవ కుమారుడైన ముసలప్పగారి ముతా అంటారు. మా వంశవృక్షాన్ని అప్పటి నుండి ఇప్పటి వరకు ఇందులో ముద్రిచడంమైనది. చినపోతినీడుకు తిరుమలప్ప, కొండయ్య, అయ్యన్న, ముసలప్ప అనునలుగురు కుమారులు ఉండిరి. ఈ కాపు కులస్థుల సంస్కృతీ

సాంప్రదాయాలకు భిన్నుడై వారిని తనతో సంబంధము చేయమని కోరగా అందుకు ఇష్టపడలేదనిన్ని దానికి ఆ రాజు తనను అవమానించినట్లుగా భావించి ఒకనాడు తన మంత్రి వర్యులతో ఉద్యానవనములో తిరుగుచూ మల్లెపూల మొగ్గలను త్రుంచినారట. ఆనాటి రాజుల వద్ద సేవకులుగా ఉండి రాజులు కన్నా అన్నివిషయాలలో మించినవారైనందున తన రాజ్యములో ఉంటూతనతో సంబంధను చేయమని కోరితే ఒప్పుకొనక తనను అవమానిస్తారా అని క్రోధము తెచ్చుకొని వారి తలలు తీసి ప్రతికారము తీర్చుకొనే భావనతో ఉన్నట్లు గ్రహించి వారు ఆ విషయము తెలుసుకున్న మరుక్షణమే రాత్రి ప్రొద్దు పోయిన తరువాత అనగా ఆనాడు రాత్రి 8-00 గంటలకే మాటు మణిగే రోజులు కావడంతో వారికందినంత వరకు వారి బండ్లు మీద ఆహారధాన్యాలు ఉన్నంత డబ్బూ వేసుకోని భార్యాబిడ్డలతో బయలుదేరి తెల్లవారేసరికి మైసూరు రాష్ట్ర సరిహద్దు దాటి చెన్నపట్నంవచ్చి ప్రాణాలు దక్కించుకొని అచ్చటి నుండి సముద్రతీరము (బంగాళాఖాతము) వెంబడి రాగా బాపట్ల తాలూకా ఖాజీపోలెం అనే గ్రామంలో మెండు వారున్నూ. మరికొందరు రేపల్లె తాలూకా వడ్డీ వారి పాలెం మీదగా ప్రయాణించి కృష్ణానదిని దాటి పులిగడ్డ గ్రామములో మండలి వారున్నూ తలగడదీవి భావుదేవరపల్లి గ్రామములో బోగాటి వారున్నూ తలగడదీవి కొత్త పాలెం గ్రామంలో బండ్రేడ్డి వారున్నూ విడిదిచేసి ఎచ్చట వారచ్చటనే స్థిరనివాసమేర్పరచుకొని వ్యవసాయము వృత్తిగా పెట్టుకొని జీవయాత్ర సాగించిరట. వీరిది మైసూరు రాష్ట్రములోని ఇప్పటి హోస్పేట వద్ద ఉన్న అనగొంది అనే గ్రామము వీరుగాక మరికొన్ని కుటుంబాల వారు గుంటూరు జిల్లా భాజీపాలెం ఆముదాలపల్లి, పెదపల్లి అల్లపర్రు, కైతేపల్లి, బొందల గరువు, పిరాటలంక గ్రామాలలోను, దివి తాలూకా పులిగడ్డ, నారాయిపాలెం, బావదేవర పల్లి, తలగడ దీవి, టికొత్త పాలెం, పర్ర చివర, పెదపాలెం గ్రామాలలోను, కైకలూరు తాలూకా పల్లెవాడు లోను స్థిరపడి వ్యవసాయమే వృత్తిగా పెట్టుకొని జీవించుచూ వారి వారి స్తోమతులను బట్టి వియ్యాలందు కానేవారు. ఈ పై ఉదహరించిన గ్రామాలలో సంబంధ బాంధవ్యములుండేవి గాని చుట్టుప్రక్కల గ్రామాలలో వీరికి 40 - 50 సంవత్సరముల

క్రితము వరకు సంబంధ బాంధవ్యాలు లేవు. ఇలా వలస వచ్చిన వారంతా రాచరీతితో మహా పౌరుషము, దర్పము నీతి నియమాలు కలవారని ప్రసిద్ధి. అందువలననే ఆ రోజులలో కూడా ఏ ప్రభుత్వము వారైననూ వీరికి ప్రధమ స్థానమిచ్చి గౌరవించెడివారట. అప్పటికే కులాలు ఉన్నవి. కాని వైవాహిక సంబంధాల వరకే కులాలు ఉపయోగించుకొనేవారు. తతిమ్మా విషయాలలో మహమ్మదీయులతో సహా ఒకరికొకరు బాబాయి, అన్నయ్య, బావయ్య, మామయ్య అని వరసలతో పిలుచుకుంటూ ఒకరికొకరు సహాయ సహకారములు అందించుకొనుచు ఉండెడివారు. ఇదంతా యెందుకు చల్లపల్లి రాజాగారి సంస్థానములో పువ్వుపుట్టినదంటే మా యింటికి వచ్చేదనిన్ని, మాసంస్థానములో కాయకాసిందంటే వారింటికి వెళ్లేదనిన్ని మా నాన్నమ్మ చెప్పగా విన్నాను. వారు కమ్మవారు మేము కాపులము.

## (3) 1857 వ సంవత్సరములో జరిగిన సిపాయిల కలహము : –

తదుపరి భారత దేశ పాలన తూర్పు ఇండియా వర్తక సంఘము అధీనము నుంచి బ్రిటిష్ సామ్రాజ్య పాలన క్రిందకు పోయినది. అప్పటి నుండి ఇంగ్లాండు రాణి విక్టోరియా అచ్చటనే ఉంటూ భారతదేశానికి రాజ ప్రతినిధిని అనగా వైస్రాయిని నియమించి ఢిల్లీ నుండి పరిపాలన సాగింపబడినది. ఆ తరుణములో భారతదేశ ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వము మీద ఎదురుతిరుగకుండా ఉండగలందులకు ఈ దేశ భూస్వాములకు ఎరవేసి లోబరుచుకొనేవారలు. అట్టి సందర్భములో 1870 - 71 ప్రాంతములో కృష్ణాజిల్లా కలెక్టరు హెచ్. న్యూమాన్ అను వారు పెద్ద పెద్ద రైతులను ఆకట్టుకొనే ఆలోచనతో మేనా (పల్లకి) లో సిబ్బందితో బోయీలతో బొబ్బర్లంక గ్రామ మునసబు గారైన ముమ్మనేని కాంతయ్య గారి ఇంటి వద్దకు వచ్చి అచ్చట మకాం చేసి వారు పెట్టిన షుమారు 10 కూరలతో ఆతిథ్యము స్వీకరించి మరునాడు తన మేనా మీద ఆ సరిగ్గా ఉన్న పోతార్లంక గ్రామ సరిహద్దుకు వెళ్ళగా అచ్చటనే రెండు చావిళ్ళలోను ఆముదపు చెట్ల క్రింద ఉన్న 150 ఆవుదూడలను (లేగలను) చూచి లేగ దూడలే ఇన్ని

ఉంటే ఆవులెన్ని ఉన్నవని ప్రశ్నించి 400 ఆవులున్నట్లు తెలుసుకొని ఆశ్చర్యపోయి యివి ఎవరివి ? ఆ రైతును పిలిపించమనగా ఎవరో వచ్చి మా తాతగారైన మండలి కేశవరాను రాయుడి గారిని తీసుకొని వెళ్ళగా మీకు భూమి ఎంత ఉందని ప్రశ్నించగా 2760 (రెండువేల ఏడువందల అరువది) ఎకరాలని అది కూడా పోతార్లంక గ్రామ సరిహద్దు నుండి రేపల్లె తాలూకా మూర్తోటగుళ్ళ వరకూ 7 గ్రామాలు, 7 లంకలతో ఉన్నదని చెప్పి వారిని ఇంటికి తీసుకుని వచ్చి కచ్చేరి చావడిలో 10 కాయగూరలు, 4 రకాల మాంసాహారములతో ఆతిధ్యమిచ్చారట ఇంతభూమి వ్యవసాయనిమిత్తం 100 కుటుంబాల వ్యవసాయ కార్మికులు భార్యాబిడ్డలతో సహా నిత్యము పనిచేసేవారలు వారికియిండ్ల స్థలము యచ్చి అందు ప్రతి కటుంబానికొక యిల్లు కట్టించి యిచ్చామని చెప్పారట. వారు ఆరిగ, దాసరి, దోవారి గుంటూరు కాకి వగైరా యిండ్లపేర్లు గలవారు. వారి సంతానము యిప్పటికి ఉన్నారు. అందు చదువుకొని ఉద్యోగాలుచేస్తూ ఉన్నవారు ఉన్నారు. అచ్చటి నుండి ఆ ప్రదేశాన్నంతటినీ పరిశీలించి తిరుగు ప్రయాణం అవుతుండగా మా తాత గారు గుప్పెటతో గుప్పెడు వరహాలు బహూకరించారనిన్ని మా నాన్నమ్మ చెప్పగా విన్నాను. ఆమె మా నాన్న గారిని ఒరే లక్ష్మయ్యా గోపాలరావు పెండ్లి చెయ్యవంట్రా. వాడికి 26 సంవత్సరాలు వేళ్లిపోతున్నవి. వాడి పెళ్ళికూడా చూసి నేను చచ్చిపోతాను అన్న మాటలు నేను విన్నాను. ఈమె తన నూరవ యేట 1946 లో మా మండువా లోగిలిలో కాలు జారి పడి స్వర్గస్థురాలైనది. అప్పటికి కూడా ఆమెకు చూపు తగ్గలేదు. చెవుడు అసలే లేదు. కొద్దిగా వంగి నడిచేది. అప్పుడు అనగా విక్టోరియామహరాణి గారి పరిపాలనలో వరహా నాలుగు రూపాయలు. ఈ సన్నివేశము విక్టోరియా మహారాణి గారికి జిల్లా కలెక్టరుగారు వివరించారో ఏమోగాని తరువాతి సంవత్సరము జనవరి ఒకటవ తేదిన లండనునగరం నుండి కృష్ణా జిల్లా కలేక్టరువారి ద్వారా బెకబెకల ఊరగాయ మా తాత గారికి పంపించినారట. మేము ఈ బెకబెకల ఊరగాయ తినమని తిరస్కరించగా ఆ మరుసటి సంవత్సరము ఇనుప నాగలి పంపగా మావి రాతి భూములు కావు. ఈ యినుప నాగళ్ళు మాకు పనికి రావని తీసుకోలేదట.

తరువాత మూడవ సంవత్సరము జనవరి ఒకటవ తేదిన విక్టోరియా మహారాణి ముద్ర వేసిన బంగారపు టుంగరము పంపగా మేము వ్యవసాయం చేసుకునేవాళ్ళం. బంగారపు ఉంగరాలు ధరించమని తిరస్కరించగా 4వ సంవత్సరము మా తాతగారి పేరు రావు బహదూర్ టైటిల్ యివ్వచూపగా. మాకు రాయలు లేరు, రావులు లేరు మా అబ్బాయిలు కోటయ్య, వెంకయ్య, లక్ష్మయ్య, వెంకట్రామయ్యలు. ఆ రావుబహదుర్ మాకు వద్దని తిరస్కరించినారట. ఆ రావ్ బహాదూర్ టైటిలు స్వీకరించిన వారు బ్రిటిష్ ప్రభుత్వానికి వత్తాసు పలికే వారని అర్థమట. అందువల్ల మా తాత మండలి కేశవ రాయుడు గారి పేరు గ్రేట్ మెన్ ఆఫ్ యిండియా అనే పుస్తకములో నమోదుచేయలేదట. అంటే మా కుటుంబము ఆనాడే బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించినది. తరువాత చాలా కాలానికి యీటైటిలు నాగాయి తిప్ప గ్రామ మునసబు గారైన స్వర్గీయ కంఠమనేని రంగయ్య గార్కి వారి 100 ఎకరాలు ఆస్తికి, అందానికి మెచ్చి రావ్ బహదూర్ టైటిలు యిచ్చిరి. అప్పట్లో గుంటూరు వాస్తవ్యుడు. వైశ్య ప్రముఖుడు స్వర్గీయ తెల్లాకుల జాలయ్య గారికి కూడా యిచ్చి లోబరచుకున్నారు. ఈయన దానశీలుడు తరువాత 1892 గాని 1893 లో గాని మా నాన్న గారు మెట్రిక్యులేషన్ ప్యాసైనారట అందుమీద మా పెదనాన్న మండలి కోటయ్య (మునసబు) గారితో అప్పటి కలెక్టరు జె.ఎన్.అట్కిన్ సన్ అనువారు. ముంచాబుగారు మీ లచ్చుమయ్యకు కోడూరులో డిప్యూటీ తహసీల్దార్ ఆఫీసులో ఉద్యోగమిస్తున్నానని చెప్పి అప్పాయింటుమెంటు ఆర్డరు పంపించగా మా నాన్న మండలి లక్ష్మయ్య గారు పులిగడ్డ నుండి 10 మైళ్ళు దూరములో ఉన్న కోడూరుక గుఱ్ఱము మీద పోయి రెండు రోజులు పనిచేసి మూడవరోజున డిప్యూటీ తహసీల్దార్ కంమేజిస్ట్రేటు వద్ద నిలబడవలసి వచ్చినదని ఈ బానిసోద్యోగము చేయనని రిజైన్ చేసి తిరిగి వచ్చారట. తరువాత ఆయన పులిగడ్డ, బొబ్బర్లంక గ్రామాలకు మునసబుగిరి చేసినందుకు గాను వారిని బొబ్బర్లంక మునసబు గారని పిలిచేవారు. అప్పట్లో వర్షాధార భూములకు యకరం 1కి మూడు పావులాలు రూ 0-12-0 శిస్తు మూడు నెలలలో వసూలు చేసి ఆ కిస్తీకి ఆ కిస్తీ వస్తులు చేసి గవర్నమెంటు ఖజానాకు పంపించే సాంప్రదాయము బ్రిటిష్‌పాలనలో

శిస్తు బాకీ పడరాదట. కట్టని రైతుల నుండి ఏదీ దొరక్కపోతే ఎట్టివాని చేత ఆ రైతు ఇంటి తలుపులు గాని అన్నపు కుండగాని ఇంట్లో నుంచి తెప్పించి జప్తు చేసేవారట. అందువల్ల అటువంటి పేదరైతుల బాకీలను గ్రామ మునసబులే జమ కట్టి తదుపరి వారి వద్ద వసులు చేసుకునేవారు. మా గ్రామ విషయానికి వస్తే మా పెదనాన్న గారి కుమారుడు కూడా మండలి కేశవ రాయుడు మా తాతగారు తన ఖజానా నుండి తీసి మొత్తము శిస్తు చెల్లించేవారని ప్రతీతి. ఈ సాంప్రదాయము నేనెరుగుదును. మా అన్న మండలి కేశవరాయుడు గారి హయములోను ఉండి యున్నది.

## 4. మా మాతా మహులది భావదేవరపల్లి గ్రామము :

ఆ గ్రామములోని అచ్చిరెడ్డిగారి ముఠాలో మా తాతగారి అన్నదమ్ములు ముగ్గురు. (1) భోగాది అమ్మన్న అనబడే రెడ్డియ్య, వెంకట రెడ్డి, పున్నయ్య గారులు. వీరి పూర్వులు ఆ గ్రామంలో భావన్నారాయణ స్వామి వారి గుడి కట్టించి డెబ్బది ఎకరముల భూమిని పూజారి, దీప, ధూప, నైవేద్యాల నిమిత్తం దానము చేసిరి. ఈ అన్నదమ్ముల తండ్రికి చదువు లేనందున వారి సహోదరులకు ఆ గుడి ధర్మ కర్తృత్వము యివ్వగా యిప్పటికి వారి క్రిందనే ఉండి యున్నది. ఈ అన్నదమ్ములెవరికీ మగసంతానము నిలువలేదు. మా తాతగారికి అమ్మన్న బుచ్చిమ్మ, లక్ష్మీ దేవమ్మ, వెంకాయమ్మ అను నలుగురు కుమార్తెలు నరసింహరావు అను కుమార్డు కలిగిరి. (1) అమ్మన్న భర్త పులిగడ్డ నాస్తప్యుడు మండలి చిన సుబ్బారాయుడు గారి కుమార్డు లక్ష్మయ్య గారు వీరి కొక్కరే మగ సంతానము. వారి పేరు వెంకట్రామయ్య (2) బుచ్చిమ్మ భర్త మెండునాగయ్య గారి కుమారుడు లింగయ్యగారు ఖాజీపాలెం గ్రామ మునసబు బుచ్చిమ్మ గార్కి ఇయ్యమ్మ, నాగయ్య అను సంతానము కలిగిన తదుపరి చనిపోగా ఆమె చెల్లెలు వెంకాయమ్మను ఇచ్చి వివాహము చేసిరి. ఈమె కూడా సంతానము లేకుండా చనిపోగా 3వ వివాహము చేసుకొని రామచంద్రారావు, రామారావు, నాగేశ్వర రావు అను ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగిరి. ఈయన 1921వ సంవత్సరములో

జరిగిన సహాయ నిరాకరణోద్యమములో పాల్గొని తన మునసబు గిరికి రిజైను చేయగా గ్రామ రైతులందరూ ఎక్కువగా క్షత్రియులే మా పెదనాన్న గారిని పల్లకీలో ఊరేగించిరట. (3) మూడవ కుమార్తె మా అమ్మ లక్ష్మీదేవమ్మ పులిగడ్డ వాస్తవ్యులు నుండలి కేశవ రాయుడు గారి కుమార్డు లక్ష్మయ్య గారు మా తండ్రి వీరు అప్పటిలోనే విద్యావంతులు మెట్రిక్యులేషన్ (లోయర్ ఫోర్తు) ప్యాసయినారట. వీరే మా తల్లిదండ్రులు. మా మేనమామ నరసింహారావు వీరు సంతానము లేకుండానె చనిపోయినారు. మా తల్లిదండ్రులకు మొదటి సంతానము నేనే. నాకు ముగ్గురు చెలెళ్ళు, ఒక తమ్ముడు కలరు. తమ్ముడు వెంకట నరసింహారావు మాత్రము హైదరాబాదులోని సేల్సు టాక్సు అప్పెలెట్ ట్రిబ్యునల్‌లో గుమాస్తాగా పనిచేయుచు. అది వరకే భార్య మహాలక్ష్మి యాక్సిడెంటులో చనిపోగా, మా తమ్ముడు ఆ దిగులుతో ఆమె చనిపోయిన 6 నెలలకు జబ్బుచేసి ఉస్మానియా ఆసుపత్రిలో ది॥ 23-6-1971 లో చనిపోగా వారికి కలిగిన ఒకేఒక్క మగ సంతానము మండలి వెంకట సత్యప్రసాద్. ఈ కుర్రవాడు కూడా నా పిల్లలతో పాటే చదువుకొని బియె.బియల్ ప్యాసై హైదరాబాదులోని హైకోర్టు, సివిల్ కోర్టులలో 1986 నుండి వకీలుగా పనిచేయుచున్నాడు.

మా మాతామహుల అన్నదమ్ములు ముగ్గురు 1864 సం. లో వచ్చిన బందరు ఉప్పెనలో వారి తల్లి, చెల్లెలు వారు చూస్తుండాగానే కొట్టుకొని పోయినారట. వీరు కూడా ఆ ఉప్పెనలో కొట్టుకుపోయి ఎక్కడో తాడి చెట్లకు పట్టి ఆ భీభత్సము తగ్గిన తదుపరి ఆ తాడి చెట్లనుండి దిగి మూడవ రోజుకు భావదేవరపల్లిలోని వారి స్వగృహానికి రాగా యిల్లు, వాకిలి కనిపించక ఎలాగో గోడల ఆచూకీ గుర్తుపట్టి యింటిలో ప్రవేశించగా పెద్ద పెద్ద బానలలో ఉన్న తమిదలు తీసుకొని విసిరి జావ కాచుకొని త్రాగి ప్రాణాలు కాపాడుకొన్నట్లు మా తాత పున్నయ్య గారు చెప్పగా విన్నాను. అప్పటికి వారెవరికీ 30 సంవత్సరాలు దాటినా వివాహము కాలేదన్నారు. ఆ ఉప్పెన తాకిడికి చిన్నలు, పెద్దలు వేలాదిగా స్త్రీ, పురుషులు, పశువులు కొట్టుకుపోయి బంగాళాఖాతాములో కలిసిపోయినారు.

5. మా మాతా మహులకు మగదిక్కు లేక నా రెండవ యేటనే నన్ను తీసుకొని వెళ్ళి పెంచినారు. నేను ఆ గ్రామములోని ఎలిమెంటరీ స్కూలులో చదువుకుంటు మా తాతగారికి వ్యవసాయ పనులలో సహాయపడుతు ఉండగా మా తాత గారు 1929 లోనో, 1930 లోనో వారి 90వ యేట చనిపోగా నేను భూమిని కవులుకుయిచ్చి మా అమ్మమ్మను తీసుకొని 1932 లో మా స్వగ్రామమైన పులిగడ్డ చేరి. అవనిగడ్డ హైస్కూలులో చదువు కొనసాగించితిని. అంతవరకు భావదేవరపల్లి ఎలిమెంటరీ పాఠశాలలో చదువు కొంటిని మా స్కూలు హెడ్‌మాస్టరు మండలి వెంకట్రామయ్య గారు విద్యాశాఖామాత్యులు గా చేసిన మండలి వెంకట కృష్ణాగారి తండ్రి వారివద్ద చదువంటే సామాన్యముకాదు. శ్రీ గల భాగ్యశాలి కడుచేరగ వత్తురు అను భాస్కర శతకములోని మొదటి పద్యము మొదలుకొని 100 పద్యములు, వేమన శతకము, దాశరధి శతకము కంఠస్తము చేసి టీకాతాత్పర్యాలతో ఏరోజుకారోజు అప్పగించాలి లేకపోతే ఆనాటి పనిష్మెంటు ముంతపొగ. మొఖముమీద గుడ్డకప్పి ముంతలో తాటి ఆకులు మిరపకాయలు వేసి నిప్పంటించగా వచ్చినపొడ పీల్చవలసిందే లేకపోతే కోదండము, గోడకుర్చి. నేనెప్పుడూ ఈ పనిష్మెంట్లు అనుభవించలేదు కాని ఒక నాడు రెండు మొట్టికాయలు తిన్నాను. వారి క్రమశిక్షణతో కూడిన విధ్యాభోదనే మమ్ములను ఇంతగా తీర్చిదిద్దినది. ఈ పనిష్మెంట్లకు భయబడి అద్దంకి రాఘవయ్య అను కుర్రవాడు (ఇప్పటికీ బ్రతికే ఉన్నాడు) స్కూలుకు రాకుండా పారిపోయి ఊరి వెలుపల ఉన్న మర్రి చెట్టులో దాకున్నాడు వారి అన్నదమ్ములు వెదుకగా మూడు రోజులకు చెట్టు మొదట్లో కనిపించగా తీసుకొని వచ్చి అలా పారిపోతావా అని బండకొయ్యి వేసి అదుపులోనికి తెచ్చినారు.

## 6. వరదలు, గాలివానలు :

1864 నవంబరు ఒకటవ తేది అనగా దీపావళి వెళ్ళిన మూడవ రోజున వచ్చిన బందరు ఉప్పెనకు షుమారు 30 వేలమంది జనాన్ని, లక్షలలో పశుసంపదను పొట్టన

పెట్టుకొన్నది. 700 జనాభాగలిగిన శివగంగలో 70 మంది మాత్రమే బ్రతకగలిగిరి 1903 లో వచ్చిన కృష్ణా నది వరదనీరు ఇండ్లపై నుండి పోయినదట. ఆ వరదకు కృష్ణానదీతీరభూములు నదీపాతమైనదట. అందులో మాకుటుంబపు 1500 యెకరాలు నదీగర్భములో కలిసిపోయినదట. తదుపరి ది 14-5-1925 మండువేసవిలో వచ్చినది గాలివాన దీనిని నేను బాగ ఎరుగుదును నాకు అప్పుడు 5 సం. మేముండే కచ్చేరి చావడిలో మాయెడ్ల జతను కట్టి పైచి మేమంతా మా పెద్దతల్లిగారి మండువాలోగిలో తలదాచుకున్నాము. మధ్యాహ్నము షుమారు 2 గంటలకు తేరిపియిచ్చినది. వేసవి కాలము కనుక పంట నష్టం లేదు. జన నష్టం గాని జంతునష్టం గాని లేదు. కృష్ణా నదికి వచ్చిన వరదలలో 1949 లో వచ్చిన వరద పెద్దది. కరకట్ల వెలుపల పంటభూములన్నియు మునిగిపోయి లోపలభూములకు ఊటనీరు వల్ల పంటలకు, ఇండ్లకు, పశుసంపదకు పెద్ద నష్టం జరిగినది.

1903 వ సంవత్సరము వరకు దివిసీమలో వరిసాగు వేకనూరు గ్రామము ధర్మ చెరువు క్రింద కొద్ది మంది భూస్వాములు మాత్రమే పండించెడి వారు. ఆ చెరువు క్రింద భావదేవరపల్లి ఆయకట్టులో మాకు య 22-00 ఎకరాల మాగాణి ఉండేదని ఆ భూమి యిదేనని మా నాన్నగారు చూపించి చెప్పారు. ఆ మాగాణలో పశువుల ఎరువుతో పాటు నీలిమందు తీయగా మిగిలిన మడ్డిని మాగాణిలో ఎరువుగా వేసి ఆ రోజులలోనే ఎకరం 1కి 15 బస్తాల ధాన్యమును పండించినారట. అదే సంవత్సరములో (1903) కృష్ణానదికి వరద వచ్చి యిండ్లమీద నుండి ప్రవహించినదట అపుడే కృష్ణానది వెడల్పై మా భూమిలో షుమారు 1500 ఎకరాల భూమి నదీగర్భములో కలిసినదట. ఆ వరదకు మా గ్రామ రైతులలో కొందరూ తమ భూమి నదీగర్భములో కలిసిపోయినందున జీవనోపాదికొరకు చుట్టాల గ్రామలకు వెళ్ళివ్యవసాయము చేసుకొని జీవించటం మొదలుపెట్టారట. ఏ గ్రామములో ఉన్న మండలి, మండల, మండెల అనువారు తమ ఆస్తిపాస్తులు పోగొట్టుకొన్నవారె. ఇప్పటికీ ఈ గ్రామములో కాపురమున్నవారికి ఎ‌బక్కరికి య 5-00 భూమిలేదు. అప్పట్లో ఏ కుటుంబానికి కత్తుభూమి (15 ఎకరాలు) కి తక్కువ

లేదట ఆంధ్రప్రదేశ్ లోని ఇతర ఏ రాష్ట్రాలలో ఉంటున్న మండలి, మండల, మండెల అను ఇంటిపేరు గలవారు పుల్లిగడ్డ నుండి వలసవెళ్ళిన వారే నేను మా వంశాన్ని గూర్చి మరికొన్ని విషయాలు మద్రాసు, హోస్పేట, విశాఖపట్నం దర్శించి అచ్చట లైబ్రరీలను పరిసీలించి మరొక సంచికలో మరికొన్ని విషయాలను వ్రాయాలని ఉంది.

1857 లో విక్టోరియా మహారాణిగారి హయాములో మామునితాత మండలి నల్ల వెంకన్నగారే భూస్వామి వారి తరువాత తరం వారి కుమార్లు మా తాత గారు మండలి కేశవరాయుడు గారు వారి తమ్ములు పెద్ద సుబ్బారాయుడుగారు, చిన్న సుబ్బారాయుడుగారు భూస్వాములు, పెద్ద పలుకుబడి గలవారు వారిహయాము 1903లో కృష్ణా నది వరదలో భూమంతా నదీప్రాతంమైనది 1925 నుండి తలగడ దీవి వాస్తవ్యులు మండల రామస్వామి గారు తాలుకా బోర్డు ప్రెసిడెంటుగా ఎంతో సేవ చేసారు మండలి వంశము పేరు నిలిపారు. వారి తమ్ములు ఎనిమిది మంది అందు లక్ష్మీనరసింహం గారు, కృష్ణా రావు గారు తలగడ దీవి పత్రచివర గ్రాము మునసబులు వారిలో బాపిరెడ్డి అనువారు రెవిన్యూయిన్స్పెక్టరగా చేస్తూ చనిపోయారు. మండలి సత్యనారాయణ గారు బందరు మునిసిపల్ మేనేజరుగా ఎంతో శేవ చేసారు. వారి తరువాత మండలి హనుమంతరావు అనువారు నెల్లూరు పురపాలక సంఘములో ఇంజనీరు చేసిరి తరువాత రాఘవరావు అను కనిష్ఠ సోదరుడు జిల్లా కాంగ్రేసు ప్రెసిడెంటుగా 1941-42 వరకు చేసినట్లుగుర్తు. తరువాత తరం ఈ తరంలో మండలి వెంకటకృష్ణా రావు ఎం. పి. - ఎం. ఎల్. ఏ. మరియు మంత్రిగా పని చేసి దివంగతులైనారు. ఈ తరంలో తలగడ దీవి వాస్తవ్యులు మండలి రామాస్వామి గారి కుమారుడు వెంకటస్వామి గారు ఒక్కదఫా 1962 నుండి 1967 వరకు ఎం.పి. గా చేసారు. ఇక యిప్పట్టి తరంలో మండలి వెంకట కృష్ణా రావుగారి జ్యేష్ఠ కుమారుడు మండలి బుద్ధ ప్రసాద్ ఎం.ఎల్.ఏ గా ఎలక్టై పనిచేయచున్నారు. మొత్తము మీద 1857 నుండి ఇది ఐదవతరం ఇందు ఎక్కువ కాలములో మా మండలి వంశీయులె మదరాసు, అంధ్రప్రదేశ రాష్ట్రలలో పలుకుబడి గలిగిన పరిపాలకులు.

1903 లో దివితాలుకా ప్రజలందరూ మెరక గ్రామమైన మా పులిగడ్డ రాగా వచ్చిన వారందరికి మా కుటుంబము 3 రోజులు భోజన వసతులు చూసి ఆదుకున్నట్లు మా నాన్నమ్మ గారు చెప్పగా విన్నాను. 120 జతల ఎడ్లు ఆ సందిలో కొట్టుకుపోయి రేపల్లె తాలూకా మోళ్ళగుంట కొత్తపాలం చేరగా అచట ఉన్న గ్రాసు పెద్ద తాతా బుల్లి వెంకటస్వామి అనే రైతు. యీయన మాజీ ఆంధ్రప్రదేస్ మంత్రిగా పనిచేసిన అనగాని భగవంతరావు గారి తాతగారు. ఇటువంటి ఎడ్లు పులిగడ్డ వాస్తవ్యులైన మండలి కేశవరాయ్డు గారికి చెందినవని భావించి వారి నౌకర్లతో మా యింటికి తోలి పంపిచినారట. 1905 సం లో రిఆర్గనైజేషన్ అమలలోకి తెచ్చి డిప్యూటి తహసీల్‌దార్ ఆఫీస్ అప్ గ్రేడ్ చేసి 1907లో తాలూకా ఆఫీసు కట్టించి దివిసీమ సైక్లోన్‌ప్రోన్ ఏరియా యని ఆఫీసు పైన రికార్డు రూము కట్టించినారని మా నాన్నగారు చెప్పగా విన్నాను. ఆ నదీ పాతమైన భూమి తిరిగి తేలుతుందని కొంతకాలము శిస్తులు కట్టి కొంత ఆస్తిని పోగొట్టు కున్నారు. అధికారము ఐశ్వర్యము ఉన్న చోటు అహంభావము సహజంగా చోటుచేసుకుంటుంది గదా ! ఆ అహంభావ ఫలితంగా మాకున్నూ అవనిగడ్డ జమిందారు కాంగ్రేకుల జమీందారులతోన్ను వర్తక ప్రముఖులు ఘంటసాల కోటయ్య గారితోను కోర్టులకెక్కడమైనది. ఆ వ్యాజ్యాలలో అప్పటి మద్రాసు హైకోర్టులో టంగుటూరి ప్రకశాం పంతులుగారు మా తరపున న్యాయవాదిగా పనిచేసిరని మా నాన్నగారు ఈ ప్రకాశం పంతులు గారు రెండు దఫాలు అవనిగడ్డ వచ్చినప్పుడు మన వ్యాజ్యాలలో యీయన మన న్యాయవాది అని చెప్పిరి. ఒకనాడు ఈ ప్రకాశం పంతులు గారు ఒరే లక్ష్మయ్యా అని పిలువగా కోపము వచ్చి తిరగబడితే ఆయన మళ్ళీ లక్ష్మయ్యా ఒరే అని పిలిస్తే నీవు నాకు ఆత్మీయుడివన్నమాట. కోపమెందుకురా అని అనగా మా నాన్నగారు కూడా నవ్వుకున్నారట. ఇలా ఉండగా 1904 వ సంవత్సరంలో మల్లీస్ దొర అనే ఇంజనీరు మా గ్రామానికి ఉత్తర సరిహద్దులో చీలిన కృష్ణానది పాయల మధ్య లూప్ ఛానల్ అనే కాలువను త్రవ్వించి కలిపి ఆ కాలువ బడ్డున 8 చిన్న యింజన్లు. ఒక పెద్దయింజను పెట్టి లిఫ్టు యిర్రిగేషన్ ద్వారా షుమారు 37,000 ఎకరాలు భూమిని దివిసీమలో మాగాణి క్రింద సాగు చేయించిరి. విజయవాడ

ఆనకట్టనుండి కృష్ణా, గుంటూరు జిల్లాలలోని నదీ తీరభూములు వరదకు ముంపు కాకుండా పెదయాదర, గుంటూరు జిల్లాలోని మొళ్ళగుంట కొత్తపాలెం వరకు ఏటికట్టలు పోయించుటకు కాంట్రాక్టరు మా చిన తాత మండలి పెద్దసుబ్బారయ్యుగారు. ఆయనకు మొదటి భార్యకు సంతానము 12 మంది కలగగా, తన 72వ యేట ద్వితీయ వివాహము చేసుకొని 9 మంది సంతానాన్ని కన్నాడు. వీరు వందసంవత్సరముల పైగా జీవించిరి వీరి మనుమలు, మునిమనుమలు పెక్కుమంది బ్యాంకులలో మేనేజర్లుగా, ఇంజనీర్లగ, లెక్చరర్లుగ పనిచేయుచున్నవారు, రిటైరైన వారు ఉన్నారు. అప్పటి వరకు నూటికి 80,90 శాతము చిన్నాపెద్దా, ముసలీ ముతగా, ఆడమగ, బాలింతలు అనే తేడా లేకుండా తమిద, జొన్న ఆరిగ, వరిగ మొదలైన ఆహారధాన్యాలే తినేవారు. అప్పటి నుండి దివిసీమ ప్రజలు వరి ధాన్యాన్ని రోకళ్ళలో దంచి తీయగా వచ్చిన దంపుడు బియ్యము ఆహార ధాన్యముగా ఉపయోగించిరి. నా చిన్నతనంలో దంపుడు బియ్యపు అన్నమే తినేవారము. 1933, 34 లలో బర్మా నుండి మిల్లు బియ్యం దిగుమతైనట్లు గుర్తు. బస్తా బియ్యము ఖరీదు షుమారు రూ 6-00 (ఆరు రూపాయలు) ఉండేది. షుమారు 1940 వ సంవత్సరము వరకు వడ్లమరలు ఇచ్చట వాడుకలోకి రాలేదు మొట్టమొదటిగా అవనిగడ్డ వాస్తవ్యుడు భూస్వామి లక్కావఝులు సుబ్రహ్మణ్యం గారు చిన్న యింజను కొని తెచ్చి రైస్ మిల్లు పెట్టినారు. అప్పటి నుండి మిల్లు బియ్యం వాడుకలోకి వచ్చినవి. స్త్రీలకు శ్రమ తగ్గినది. ప్రతిఫలంగా స్త్రీలకు శరీరపరిశ్రమపోయి అనారోగ్యాలు చుట్టుకొన్నవి. అప్పట్లో పెండ్లి కూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు రోకలికూడా వడ్లుదంపు కోటానికి యిచ్చేవారు.

7. కాలక్రమేణా ఆ లిప్టు యిర్రిగేషన్ వల్ల చాలినంత నీరు వరిసాగుకు అందని కారణంగా పులిగడ్డకు తూర్పువైపున ఉన్న కృష్ణానది పాయకు ది. 14-1-1934వ తేదీన గౌరవనీయులైన సర్ ఎ.వై.జి. క్యాంప్‌బెల్ అనే చీఫ్ యింజనీరు గారు ఒ.ఎస్.ఐ.సి.బి.సి., వి.డి., ఐ.సి.యస్ అను మద్రాసు రాష్ట్ర గవర్నమెంటు యిర్రిగేషన్ సభ్యులు పునాది

రాయి వేయగా ది. 25-8-1936 వ తేదీన ఓవర్ ఆల్ పోడవు 36 దిమ్మల మీద నిర్మించిన క్యాంప్‌బెల్ ఆక్విడక్టు మరియు వంతెనను మూడులక్షల రూపాయలతో లండను నగర గ్యానన్ డంకర్లీ కంపెనీ వారిచే పూర్తి చేయబడి అప్పటి హిజ్ ఎక్సలెన్సీ రావ్ బహద్దూర్ కూర్మా వెంకట రెడ్డి నాయుడు గారిచే ది. 25-8-1936న ఓపెన్ చేయబడినది. ఆ రోజు గవర్నరు గారి వెంట జుబ్దాతుల్ ఆక్రాన్ శ్రీ మంతు రాజా యార్లగడ్డ శివరాను ప్రసాద్ బహదూర్ గారైన చల్లపల్లి జమీందార్ గారున్నూ అప్పటి కృష్ణాజిల్లా కలెక్టరు గారు యం.వి.సుబ్రహ్మణ్యాన్ గారున్నూ రాగా ఆ ఓపెనింగు కార్యక్రమము పూర్తియినది. ఆ రోజులలో రోజువారికూలీ అణాన్నర అనగా యిప్పటి 9 నయాపైసాలు మొదలుకొని పావులా అనగా 25 నయాపైసలు ఉండేది. ఇవి అన్నీ నేను కళ్ళారా చూచిన ఘట్టాలే.

అప్పటి నుండి ఆ యేటి మీద పడవ ప్రయాణము మటు మాయమై సులభంగా కాలినడకన సైకిళ్ళు, బండ్లు, కార్లు ప్రయాణము సాగినది. ఈ ఆక్విడక్టు కాలువ గుండా వచ్చిన నీటిని విడుదల చేసి దివిసీమ ప్రజలకు మహొన్నతమైన సాయము చేసిరి ఇంతటితో పులిగడ్డలోని లిఫ్టు యిర్రిగేషను మాయమైనది. 1925 వ సంవత్సరములో 14 మేనెల మండు వేసవి కాలములో పెద్దగాలివాన వచ్చినది. ఆ గాలి వానకు మా కొబ్బరి చెట్టు ఒకటి పడిపోగా బండెడు కొబ్బరి కాయలు నేను మా మేనత్త కుమారుడు ఒద్రే నాగభూషణం గారున్నూ యింటికి మోశాము. మేము మా కచ్చేరి చావడిలో ఉండేవారము. ఆ గాలివాన రోజున మా ఎడ్లను యింటిలో కట్టివేసి మేము మా పెదతల్లి గారింటికి పోయి తలదాచుకున్నాము. ఆగాలివాన షుమారు ఉదయం 9-10 గంటలకు మొదలై పగలు 2 గంటల ప్రాంతములో ముగిసినది. ఆ గాలివానకు నష్టము పెద్దగా లేకపోవచ్చు ఎందుకనగా అది వేసవి కాల గాలివాన. పైరుపంటలుండని కాలము. ఈ గాలివాన నా కనుభవమే 1930-31 సంవత్సరాలలో పది బస్తాల ధాన్యము ఖరీదు రు. 22 లేక 23 రూపాయలు. ఎకరం భూమి ఖరీదు రూ10-00 మొదలు రూ 200-00 ఇండేది. వరిపండే మొదటితరం భూమి శిస్తు ఎకరం -1 కి రు. 8.00 (ఎనిమిది

రూపాయలు)ఉండేది. కాగా ఈ ఆక్విడక్టు గుండా వచ్చిన కృష్ణా నీటి వల్ల భూమి సారవంతమై అధిక దిగుబడి రాగా బస్తా 1కి 4-00 రూపాయలు లేదా 5-00 రూపాయలు వరకు పెరిగినది. ఎకరం ఖరీదు రూ 600-00 లకు పెరిగినది. ఇప్పుడు శిస్తుషుమారు రూ 200/- కు పెరిగి ఎకరం 1 లక్ష రూపాయల నుండి పదిలక్షలకు పెరిగినది.

స్వాతంత్ర్యానంతరం ఈ నియోజకవర్గ ఎమ్.ఎల్.ఎ దివంగతులైన మండలి వెంకట కృష్ణారావు తూర్పున హంసలదీవి, పడమరన ఏటిమొగ వరకే ఉన్న ఏటి కట్టిను కలిపి 14 మైళ్ల సముద్రపు కట్టను న్మిర్మాణము చేయించి సముద్రపు ఆటుపోటులకు గురికాకుండా చేయగా అదనంగా కొంత భూమి సాగులోనికి వచ్చినది. ఆ అదనపు భూమి సాగుకు ఆక్విడుక్టు ద్వారా వచ్చిన నీరు చాలనందున ది. 5-7-1975న అప్పటి ముఖ్యమంత్రి దివంగత జలగం వెంగళరావు గారి చేత యాక్వడక్టు వెడల్పు చేయుటకు 3వ కాలువకు శంఖుస్థాపన జరిపించి ది. 9-6-1977న వారిచే తనే ఓపెన్ చేయించిరి. దీని కాంట్రాక్టరు శ్రీకాకుళం గ్రామ వాస్తవ్యులు శ్రీ శీవం వీర రాఘుపయ్యగారు. ఈ ఆక్విడక్టు క్రింద యిప్పుడు 70,000 ఎకరాల వరిసాగు చేయబడుచున్నది. ఈ కృష్ణానీటి వల్ల యిప్పుడు ఎకరం 1కి ఇరువది బస్తాలు పండే వరి ధాన్యం నలుబది బస్తాలకు పెరిగి మిగులు ధాన్యము యితర రాష్ట్రాలకు ఎగుమతి అగుచున్నది. ఇంత సుభిక్షంగా ఉన్న దివిసీమను ది. 19-11-1977 ఉప్పెన సముద్రపు కట్టను తుడిచివేసి సముద్రతీరం వెంట ఉన్న గ్రామాలన్నింటిని ముంచివేసి షుమారు పదివేల మంది జనాభాను లక్ష వరకు పశువులను, గొర్రెలు, మేకలను పొట్టన పెట్టుకొన్నది. పంట పండి కోతకు సిద్ధముగా ఉన్న వరి పైరను ముంచివేసి దివిసీమ ప్రజలను కరువు కాటాకాల పాలుచేసి, భయభ్రాంతులను చేసినది ఆ నాడు మంత్రివర్యులు దివంగత మండలి వెంకట కృష్ణారావు (విద్యామంత్రి) అవనిగడ్డలో ఉదయం 6-30 గంటలకు హైదరాబాదు బయలుదేరుతుండగా, సైక్లోను వార్నింగు విన్న వారి భార్య శ్రీమతి ప్రభావతీ దేవి గారు భర్తను బయలుదేర వద్దని హైదరాబాదు నుండి ఫోను చేయగా ఆ ప్రయాణము

మానుకొనబట్టి గాంధిక్షేత్రములో ఉన్న షాలిం హాస్టలులో 80 మంది, ఆ పిల్లలను స్వయంగా సేవాశ్రమమునకు సురక్షితంగా చేర్పి వారిని కాపాడిరి. ఆ రోజు వారికి తోడుగా గాంధిక్షేత్రము మేనేజరుగా నేనున్న పి.డబ్ల్యు. డి యింజనీరు లంక పురుషోత్తమరావు గారు కూడా ఉండి వారికి సహాయ సహకారములు అందించితిమి. ఆ ప్రళయమునకు చెట్లు విరిగి, కరెంటు స్తంభాలు, టెలిఫోను తీగలు తెగిపోయి రహదారులకడ్డముగా పడినందు వల్ల ప్రయాణ సౌకర్యము లేక ఏ గ్రామమేమై పోయినదోనని శ్రీ కృష్ణారావు కాలినడకన ఊరూరా తిరిగి పరిస్థితులను ముఖ్యమంత్రికి టి.వి. ద్వారా ఇతర దేశాలకు తెలియజేయగా వారంతా ఈ ప్రళయ భీభత్సమును చూచుటకు వచ్చి వారి సహకారములందించిరి రోజుకు పదివేల మందికి గాంధిక్షేత్రములో ఆశ్రయమిచ్చి మండలి వెంకట కృష్ణారావు భోజన వసతులు ఏర్పాటు చేసిరి. ఆ సమయములో నేను గాంధిక్షేత్రమునకు ఫౌండర్ ప్రెశిడెంటు దివంగత మండలి వెంకట కృష్ణారావు, వర్కింగ్ ప్రెశిడెంటు దివంగత ప్రభాకర జీ ఈయన గాంధీ మహాత్ముని ముఖ్య శిష్యుడు, వైస్‌ప్రసిడెంటుగా దివంగత జయసింహాచారి (కడపకోడూరు) - మాజీ రాష్ట్ర పోలీసు డిపార్టుమెంటులో ఫింగర్ ప్రింట్స్ స్పషలిస్టు శ్రీ కోట కేశవపెరుమాళ్లు సెక్రటరీగానున్న, లలితకళాసమితికి శ్రీ అన్నపరెడ్డి సత్యనారాయణ అధ్యక్షులుగా నున్న నేను వీటన్నింటికి మేనెజరుగానున్నూ ఉండియున్నాను గాంధి క్షేత్రము వర్కింగ్ ప్రెశిడెంటు దివంగత ప్రభాకర్ జీ ఒకనాడు నన్ను పిలిచి తహసీల్‌దారు గారు (ఆయనకు నన్ను తహసిల్ దార్ గారూ అని పిలిచే అలవాటు). ఇది అవనిగడ్డ అ అంటే అన్నము, వ అంటే వస్త్రము, ని అంటే నివాసము గల గడ్డ మీరు నాకు ఈ గ్రామ ఇండ్ల వెంట తిరిగి వారి ఆర్థిక పరిస్థితులు కుటుంబాని కొకకాగితము వ్రాసుకొని ఆ సర్వే రిపార్టు నాకిస్తే నేను ఈ గ్రామాన్ని అన్న, వస్త్ర, నివాసములకు లోటు లేనిదిగా సహాయ సహకారములందించి దీనినొక ఆదర్శ గ్రామముగా తీర్చిదిద్దుదామన్నారు. కాని కొలది కాలములోనే గుంటూరు. ఒంగోలు జిల్లాలలో కలిగిన ఉప్పెన ప్రళయ భీబత్సములో ఆహార పానీయాలు లేకుండా చేసి హఠాత్తుగా 1979లో జూన్ 18న దివంగుతులైయిచ్చుట ప్రజలను దుఃఖ

సముద్రములో ముంచివేసిరి. అది దివంగత వెంగళరావు గారి ప్రభుత్వము. మండలి వెంకట కృష్ణారావు (విద్యాశాఖామంత్రి)కి సహాయకార్యక్రమాలు అప్పగించగా అనేక దేశదేశాల సేవా సంస్థలు, ప్రభుత్వాలు సహాయపడగా ఊరూరు పడిపోయిన యిండ్లుకు పక్కాభవనాలు, కమ్యూనిటీ షెల్టర్లు కట్టించి, సముద్రపు కట్టను (హంసలదీవి నుండి ఏటిమొగ వరకు) తిరిగి మరమ్మతులు చేయించి సముద్రపు నీటి ముంపుకు గురికాకుండా కాపాడినారు. ఆ సైక్లోనులో అనేక మంది భార్య పోయిన వారికి, భర్త పోయిన వారికి తిరిగి గాంధీ క్షేత్రములో షుమారు 200 పునర్వివాహాలు జరిపితిమి. ఆ సాముహిక వివాహాలకు దివంగత ఎన్.టి.రామారావు, నాగేశ్వరరావు వగైరా సినీనటులు హాజరై నూతన దంపతులను ఆశీర్వదించిరి.

నాజీవిత చరిత్రలో నేను నాకు 10,12 సంవత్సరాలు వచ్చే వరకు మా మాతామహుల యింట భావదేవరపల్లిలో పెరిగనట్లు పైన చెప్పియున్నాను.

## 8. స్వాతంత్ర్య పోరాటంలో పాత్ర :

అవనిగడ్డలోని జిల్లా బోర్డు హైస్కూలులో చదివేటప్పుడు తెలుగు పండితులు దివంగత చిలకపాటి సుబ్బారావుగారు, దివంగత కావూరి వెంకట్రామయ్య చౌదరి గారలు తెలుగు పాఠాలు చెప్పుచూ ఎప్పుడూ బ్రిటిషు ప్రభుత్వపు దుష్ట పరిపాలనను ఎత్తిచూపుతూ ఉండేవారు. జైలులో రాజకీయ ఖైదీగా అనుభవించిన అనుభవాలను (కష్టాలను) తేటి తెల్లయుగా విశదీకరంచేవారు. ఆనాడు జైలులో దివంగత చిలకపాటి సుబ్బారావు గారికి ఇనుప మూకుళ్ళలో పురుగులతో వండిన అన్నము, కూరలు పెట్టేవారనిన్నీ, కొన్ని రోజులు వాటిని చూచి డోక్కని తినకుండా జైలుస్టాఫ్ చూడకుండా పారవేశారనిన్ని ఒకనాడు అలా పారవేయటం చూచి జైలు స్టాఫ్ కొట్టి తినిపించారనిన్ని, జైలుకు వెళ్ళిన వారము రోజులలో షుమారు ఎనిముది కిలోల బరువు తగ్గగా, అలాగే కళ్ళుమూసుకొని ఆ పరుగుల కూడు తిని ప్రాణాలు నిలబెట్టుకున్నామని చెప్పి మమ్ములను ఉద్రేకపరిచేవారు. అసలే మా తాతగారు బ్రిటిషువారిచ్చిన రివార్డులను

తిరస్కరించిరి. మా నాన్న గారికి యిచ్చిన కోడూరు డిప్యూటీ తహసిల్దార్ ఆఫీసు గుమస్తా గిరికి ఈ పరాయి ప్రభుత్వములో బానిసోద్యముచేయనని రిజైన్ చేసిరి గదా ! ఈ రెండు ప్రేరణల వలన నేను ఆకర్షితుడనై ఖద్దరు నడుకుచూ, ధరించుచూ ఉండగా 1941 లో ఒక నాడు మా రాజకీయ గురువు దివంగత చిరువోలు రాధాకృష్ణమూర్తి వ్యక్తి సత్యాగ్రహము చేస్తుండగా చూడడానికి పోలీసు స్టేషనుకు వెళ్ళగా పోలీసులు లాఠీలతో వెంటబడగా పరుగు పెట్టితిని. ఆ పరుగులో ఒక కాలు పైజామాలో పడగా నేను మురాల వీరాస్వామి యింటి వద్ద రోడ్డు మీద పడ్డాను. మోకాలికి దెబ్బ తగిలి రక్తసిక్తమైనా పోలీసులు కందకుండా పారిపోతిని నాకప్పటికి వయస్సు 21సంవత్సరాలు ఎడమ మోకాలి మీద దెబ్బ యిప్పటికినీ ఆనవాలు కనబడుచున్నది. ఏలేశ్వరపు కృష్ణమూర్తి అనువారు పెదప్రోలు గ్రామ వాస్తవ్యులు. కాంగ్రెస్ కార్యకర్త కాలినడకన అవనిగడ్డ నుండి పెదప్రోలు గ్రామము వెళ్ళుచూ నన్ను ఒక పెద్ద కత్తి తీసుకు రమ్మనగా నేను మా యింట్లో ఉన్న ఎలుకల కత్తితో టెలిఫోను తీగలను నరకగా పెద్ద ధ్వని వచ్చినది. ధ్వనికి భయపడి కాబోలు నన్ను వదలి ఆ ఏలేశ్వరపు కృష్ణమూర్తి వారి ఊరు పారిపోయిరి. నేను కూడా భయపడి బొబ్బర్లంకవైపు వెళ్ళే డొంక వెంట పడి పారిపోగా కాళ్ళనిండా తుమ్మ ముళ్ళు గ్రుచ్చుకొని నడువలేక నెమ్మదిగా ఒక పొద చాటున నక్కినాను. అప్పటికి బాగా చీకటి పడినది. నేను నడవలేని పరిస్థితి. రెండో వైపు భయము. ఏమి తోచక నేను తొడుగుకున్న ఖద్దరు చొక్కాను రెండు ముక్కలుగా చించి రెండు పాదాలకు కట్టుకొని నెమ్మదిగా కుంటుకుంటూ రాత్రి 9-00 గంటలకు యిల్లు చేరితిని అప్పటికి ఊరు మాటు మణిగినది. అనగా అందరూ నిద్రపోయారన్న మాట. నేను వచ్చి గదిలో మూల పడుకొని ముళ్ళ బాధకు మూలుగుచుండట చూచి మా అమ్మగారు ఖంగారుగా ఏమిటీ పరిస్థితి అని అడిగితే ముళ్ళు గ్రుచ్చుకొన్నట్లు చెప్పగా తెల్లవారగానే దగ్గరలో ఉన్న దుష్టపు తీగ తీసుకొని వచ్చి దాని పాలు (తెల్లనివి) నాకు ముళ్ళుగ్రుచ్చుకొన్న చోట్ల రాసినది, పాలు రాసిన ఒక పావు గంట షుమారులోనే బాధ తగ్గిపాదాలు బండు బారినవి. అప్పుడు సూదిలో ఆ ముళ్ళనుతీసివేసి వేడి నీటి కాపడము పెట్టగా ఆ బాధ తగ్గినది మరొకనాడు గ్రామములోని

కాంగ్రెస్ పెద్దలు నేమూరు నారాయణ మూర్తి, చిరువోలు రాధాకృష్ణమూర్తి, పరుచూరి బైరాగి (బందలాయి చెరువు) గద్దే వెంకట కృష్ణయ్య (ఎర్ర) పరుచూరి ఉమామహేశ్వరరావు, తూపాటి వెంకట్రామయ్య, అళ్ళ బాలకోటయ్య, భూపతి వెంకట్రామయ్య ఇంకా షుమారు పాతిక మంది క్విట్ యిండియా యాజిటేషన్ గూర్చి ఏమి చేద్దామని ఆలోచిస్తూ సి.బి.ఎం. స్కూలు వైపుకు వెళ్ళితిమి అచటనే జాన్‌హార్టు అను తెల్లదొర సి.బి.ఎం. స్కూలు హాస్టలు నడుపుచూ అక్కడనే బంగళాలో కాపురముండియున్నాడు. వారిని చూచి నేను మా పెద్దలతో నాకు ఒక తుపాకి యిచ్చి దానిని ఆపరేట్ చేయడం నేర్పించండి. ఈ తెల్లవాడిని యిప్పుడే హతమారుస్తానంటూ వాని మీదకు దూకగా వారంతా నన్ను నీది యగ్రెసివ్ టైపు. నీవు ఒక తెల్లవానిని చంపితేవారు మన వాళ్ళను లక్షల మందిని నిముషాలలో చంపుతారు. మనది అహింసా తత్వము. హింస పనికిరాదు. హింసతో స్వరాజ్యము రాదని గాంధి గారి ఉద్బోధ అని నన్ను వారించారు. ఇతను కుర్రవాడు లెండి ఏమి అనుకోవద్దని జాన్‌హార్టుతో చెప్పారు. నన్ను అక్కడి నుండి యింటికి వెళ్ళమని చెప్పగా పులిగడ్డ చేరితిని. అదే రోజు సాయంత్రం ఒక కానిస్టేబుల్ వచ్చి మా అన్న మండలి కేశవరాయుడు (గ్రామ మునసబు) గారి వద్దకు వచ్చి నన్ను వాకబు చేయగా వాడు (అనగా నేను) ఊళ్ళోలేడు. రేవు అవతల చుట్టాల యింటికి వెళ్ళినట్లు చెప్ప... నేను 20-8-1942 నుండి అక్టోబరు 1943 వరకు పగటిపూట రెల్లు లంకలోను, రాత్రిపూట పశువుల చావడిలోను దాక్కొని, యింటి వద్ద నుండి పంపించే అన్నము తిని కొంతకాలము అనగా ఆ యాజిటేషన్ ఉధృతము తగ్గేవరకు ఆజ్ఞాత వాసము చేసి బయటకు వచ్చితిని. అప్పట్లో రెండవ ప్రపంచ యుద్ధము జరుగుతున్నది. 3rd Form ప్యాసైన వారికీ కూడా తాలూకాలో గుమాస్తా గిరి యిచ్చిన రోజులు ఉద్యోగములో చేరదామంటే నాకన్నా ముందుగా ఈయన జాతీయ ఉద్యమంలో పాల్గొన్నట్లు చెప్పగా నాకు ఉద్యోగము దొరకలేదు. 1944 వ సంవత్సరం అక్టోబరు 2వ తేదికి గాంధీ గారికి 75 సం॥లు నిండిన సందర్భముగా అవనిగడ్డలో 75 రెండెడ్ల బండ్లతో గాంధి గారి ఫోటో ముందు బండిలో నిలబెట్టి ఊరేగించితిమి. ఆ సందర్భములో నేను

10 రెండెడ్ల బండ్లను తోలించుకొని వెళ్ళి ఆ ఊరేగింపులో పాల్గొంటిని. భారత దేశమంతా ఈ వేడుక జరిపిరి. అందుకు ప్రతిగా ఆనాడు గాంధి గారు దిగువ ఉదహరించిన మెస్సేజి ఈయగా ఆనాడు ఇంగ్లీషు పత్రికలలో ఈ విధముగా వ్రాయబడినది చదువుకున్నాము.

" I shall work for an India in which the poorest shall feel tat it is their own country in whose making they have and effective voice, an India there shall be no high class or low class of people, In India all communities ~~sahll~~ shall live in perfect harmony. There can be no room in such India for the curse of untouchability, of the curse of intoxication of drinks or drugs women also will enjoy the same right as men. This is the India of my dreams

sd/-

M.K. Gandhi

ఆ రోజులలో మాతో పాటు హైస్కూలు విద్యార్థులు తూమాటి కోటేశ్వరరావు, మండలి వెంకట కృష్ణారావు, తూమాటి బాలకోటేశ్వరరావు, తూమాటి వెంకటేశ్వరరావు, వడ్లమూడి గోపాలరావు, గంగు బ్రహ్మయ్య, అన్నపరెడ్డి ఆంజనేయులు, ఆకుల మాణిక్యాలరావు వగైరాలు ఎంతో మంది క్విట్ యిండియా మూవ్‌మెంటులో పాల్గొని ఉద్యమాన్ని బలపరిచిన వారిలో ఉన్నారు. వీరంతా అప్పటికి మైనర్లు.

ఉపాధ్యాయ వృత్తి : ఒకనాడు నేను పార్టీ సమావేశము ముగించుకొని అవనిగడ్డ నుంచి పులిగడ్డలో ఉన్న మా యింటికి వస్తుండగా సింగోతు వెంకటసుబ్బయ్య అను కుర్రవాడు నాకెదురు వచ్చి నమస్కరించి తను సింగోతు యతిరాజులు కొడుకునని, తను పులిగడ్డలోని ఎలిమెంటరీ పాఠశాలలో 5వ క్లాసు ప్యాసైనానన్ని. హైస్కూలులో చేరడానికి వెళ్తే 4వ క్లాసులో చేర్చుకుంటామన్నారు. నేను 5వ క్లాసు ప్యాసైన వాడిని మళ్ళీ 4వ

క్లాసు చదువుటకు సిగ్గు పైచి చేరలేదు. ఆ రోజులలో 4 వ తరగతి నుండి ఇంగ్లీషు భోధించేవారు. అందువల్ల తనకు ఈ సంవత్సరము 4,5 తరగతుల ఇంగ్లీషు చెబితే వచ్చే సంవత్సరము 6 వ తరగతిలో, (1స్ట్ ఫారమ్) చేరతానని ఇంగ్లీషు చదువుకొని చెప్పేవారెవరూ లేరని చెప్పగా అప్పుడే తీసుకొని వచ్చి మా యింటి వద్ద అరుగు మీద కూర్చోబెట్టి ఇంగ్లీషు అక్షరాలు మొదటి బడి వ్రాసి ఒకసారి దిద్దించి రేపటికి ఈ అక్షరాలన్నీ రావాలని చెప్పి పంపించినాను. మరునాడు ఈ వెంకట సుబ్బయ్య మరొక కుర్రవాడు మండలి అంజయ్య గారి కుమార్డు నానారావును, కొత్త పాండు రాంగారావు, ఘంటసాల పెద లక్ష్మయ్య, చిన లక్ష్మయ్య నంబూరు రమదాసు, మొదలైన వారిని తీసుకు రాగా వారందరికీ ఇంగ్లీషు అక్షరాలు వ్రాసియిచ్చి 4వ తరగతి ఇంగ్లీషు పుస్తకాలు కొని తెచ్చుకోవలసినదని చెప్పగా, వారందరూ 4వ క్లాసు పుస్తకం కొని తెచ్చుకోగా, ఆ 4వ తరగతి యింగ్లీషు పుస్తకాన్ని 3 నెలలలో పూర్తి చేయించి వెంటనే 5వ తరగతి యింగ్లీషు పుస్తకం తెచ్చుకోమని చెప్పగా 5వ తరగతి యింగ్లీషు పుస్తకం మొదలు పెట్టిన ఒక నెలకు మొదటి కుర్రవాడు అగ్నికుల క్షత్రియుడు మూడు పావులాలు మాత్రమే యిచ్చినాడు తతిమ్మా వారందరూ తలా ఒక రూపాయి యిచ్చినారు. నేనడగలేదు. రోజుకు ఒక గంట చెప్పేవాడిని. అలాగే 5వ తరగతి పుస్తకం మరొక 3 నెలలకు పూర్తి కాగా వారందరినీ ఫస్టుఫారం పుస్తకాలన్నీ తెచ్చుకొనమని చెప్పగా వారికి ఫస్టుఫారం పుస్తకాలు అన్ని సబ్జక్టులలోను రెండు పూటలా, భోధించి జూన్ నెలలో హైస్కూలుకు 2వ ఫారం లో చేర్పుటకు పరీక్ష వ్రాయించగా అందరూ మంచి మార్కులతో ప్యాసైనారు. వెంటనే ఆ హైస్కూలు ఉపాధ్యాయులందరూ నీవు ఈ లైనులో ఉంటే పులిగడ్డలో కాదు. అవనిగడ్డలో ఉంటే కూడా మా పిల్లలందర్నీ పంపిస్తామని చెప్పగా. ఈ స్కూలు నడిపే బాధ్యత కీర్తిశేషులు ఎన్. ఎస్ రంగనాయకులు గారికి అప్పగించగా వారూ వారి యింటికి దగ్గరగా ఒక చావడి ముళ్ళపూడి వెంకటరత్నం గారిది నెలకు రు. 3-00 ల అద్దె మీద కుదిర్చి మంచిరోజు చూచి హైస్కూలు టీచర్సు పిల్లలతో సహా పిల్లలందరినీ పిలిపించి నాతో చదువు చెప్పించి నాకు ఎంతో సహాయము చేసినారు. వారికి సర్వదా కృతజ్ఞుడను.

ఆయనకు కళ్యాణి అనే కుమార్తె, మోహనరావు అనే కుమారుడు ఉన్నారు. కళ్యాణి భర్త పకీరయ్య గారు. వారు తమిళనాడులోని ఎలక్ట్రికల్ డిపార్టుమెంటు చీఫ్ యింజనీరుగా రిటైరై ఉంటారు. వారిది గాని, కుమారునిది గాని అడ్రస్ తెలియకున్నది.

ఈ స్వాతంత్ర్య సమర కాలములో స్వర్గీయ టంగుటూరి ప్రకాశం పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, ప్రగడు కోటయ్య, ఎన్.జి. రంగా,కల్లూరి చంద్రమౌళి, గొట్టుపాటి బ్రహ్మయ్య ఎక్కువగా అవనిగడ్డలో మకాంవేసి స్వాతంత్ర్య సముపార్జన కొరకు గాంధి గారు యిచ్చిన నినాదము చావో బతుకో తేల్చుకోవలసి ఉన్నదని ఉపన్యాసాలు యిచ్చెడివారు. ఎవరు వచ్చినా అవనిగడ్డలో ఆత్కూరి నాగేశ్వరరావు గారనే పెద్దరైతు మీటింగుల నేర్పాటు చేస్తూ వచ్చిన వారికి ఆతిథ్యమిచ్చి తన నలుబది ఎకరాల భావదేవరపల్లిలోని మాగాణి భూమిని హారతి కర్పూరము చేసుకున్నాడు. పై వారందరు కూడా తమ ఆస్థిపాస్థులను స్వాతంత్ర్య సముపార్జనకే అర్పించిరి. అప్పట్లో స్వాతంత్ర్యము కొరకు పోరాడిన వారంతా భూస్వాములే. భారత దేశ ప్రజలంతా గాంధి గారి ఆశయాలకనుగుణంగా సత్యము, అహింస అనే రెండు ఆయుధాలతో అలుపెరుగని పోరాటమునకు బ్రిటిష్ ప్రభుత్వము వారు భయపడి భారతీయ ప్రజల సహకారము లేనిదే మనమీదేశాన్ని పరిపాలించలేమని 1935 ఇండియా చట్టం క్రింద ప్రాంతీయ ప్రభుత్వం ఏర్పరచుకొనే వీలు యిస్తూ బ్రిటిష్‌వారు కొన్ని షెడ్యూల్సులో మినహాయింపులు వ్రాసి పెట్టారు. గాంధీ గారు ఈ పద్ధతి వద్దన్నారు. రాజాజీ, అయ్యదేవర కాళేశ్వరరావు గారు, కూర్మ వెంకట రెడ్డి నాయుడు గారు తర్కించి చర్చించి ఈ 1935 ఇండియాచట్టంలోని గుట్టు మన పక్షానే ఉన్నదని కూర్మావెంకటరెడ్డి నాయుడు గారు చెప్పగా గాంధీగారు అంగీకరించారు. ఆ ప్రకారము 1946లో ఎలక్షను జరిగినవి. ఆ ఎలక్షన్సులో మూడు రంగుల పెట్టె కాంగ్రెసుకు రెండు రంగుల పెట్టె సోషలిష్టులకు, ఎర్ర రంగు పెట్టె కమ్యూనిష్టులకు కేటాయించినారు. ఓటు ఏ గుర్తు పెట్టకుండా వారికిష్టమైన పార్టీ గుర్తుబ్యాలెట్ పెట్టెలోవేయాలి. మా గ్రామ ఓట్లన్నీ కాంగ్రెసుకే వేయించితిని. చివరకు

తలగడదీవి కోటయ్య చోరగుడి వెంకట్రామయ్య గారలు వయోవృద్ధులు. వారిని మోర్ల సోమయ్య బండి మీద తాలూకాఫీసునకు తీసుకొని వెళ్ళి 3 రంగుల పెట్టెలో ఓట్లు వేయించితిని. ఆ బండి బాడుగ యిద్దరికీ కలిపి అర్ధరూపాయి. వారే యిచ్చుకున్నారు. ఆ ఎలక్షన్సులో గొట్టిపాటి బ్రహ్మయ్య గారికి యివ్వవలసిన సీటు స్థానికులు కాని గుడివాడ తాలుకా వల్లభనేని రామ బ్రహ్మము గారి భార్య సీతామహాలక్ష్మీ గారికి యిచ్చారు. ఆమె స్వాతంత్ర్య సమర పోరాటవములో తన విలువైన విదేశీ బట్టలను పబ్లిక్ గా తగులబెట్టినందుకు గాను మెజారిటీ సభ్యుల కోరిక ప్రకారం ఆమెను కాంగ్రెస్ అభ్యర్థిగా సెలెక్టు చేసిరి. ఎలక్షన్సులో ఆమె గెలుపుకుతీవ్ర కృషి చేసితిని. తరువాత 1952లో జరిగిన ఎలక్షన్సులో వయోజన ఓటింగు అమలులోకి వచ్చినది. అప్పటి నుండి ఏ ఊరి కా ఊరిలో వందలు, వేల ఓట్లు పెరిగినది. పోలింగు బూతులు అన్ని గ్రమాలలో వెలసినవి. ఈ వయోజన ఓటింగు వచ్చిన తదుపరి డ్యురేషన్ 3 సంవత్సరాలు చేసి కొన్ని చోట్ల బడుగు వర్గాలకు సీట్లు యిచ్చి గెలిసించుటకు గాను కొన్నింటిని ద్విసభ్య నియోజక వర్గముగా విడదీసి, ఒకరు రెగ్యులర్ అభ్యర్థి కాగా రెండవవారు బడగు వర్గాల అభ్యర్థి. ఈ బడుగు వర్గాల అభ్యర్థికి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థీ డిపాజిట్ చేసి తన కారులో త్రిప్పుకుంటు వారిద్దరికీ ఓటు యివ్వమని అభ్యర్థించేవారు. 1952 ఎలక్షన్సులో గోట్టిపాటి బ్రహ్మయ్య గారు రెగ్యులర్ అభ్యర్థీ బడుగు వర్గాల తరుపున వేముల కూర్మయ్య అభ్యర్థీ ఆ ఎలక్షన్సులో జనరల్ సేటులో గోట్టిపాటి ఓడిపోయి చంద్ర రామలింగయ్య గారు కమ్యూనిష్టు పార్టీ తరపున గెలువగా కాంగ్రెస్ తరపున బడుగు వర్గాల అభ్యర్థి వేముల కూర్మయ్య గారు గెలిచి, కమ్యూనిష్టు పార్టీ తరపున బాపనయ్య గారు ఓడిపోయారు. ఇందు చల్లపల్లి రాజా శ్రీమంతురాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహదూర్ కావాలని వ్యతిరేకించి బ్రహ్మయ్య గారిని ఓడించారని వదంతు. బ్రహ్మయ్య గారు జమిందారీ వ్యతిరేక పోరాటములో ప్రధానపాత్ర వహించటమే దీనికి కారణం. బ్రహ్మయ్య గారు దేవరకోట ఎస్టేటులోని ఒక రైతు వేసిన పంటను పరిశీలించి వేరుశనగ వేస్తే క్రింద పంట వారిదనిన్ని. జొన్న వేస్తే పై పంట వారిదనిన్నీ వసూలు చేసి, మాకు వేరుశనగ కంప, జొన్న చొప్ప వదలి

మమ్ములను (ఎస్టేటు రైతులను) సూడుప్పకు తినేవారని ఇప్పటికి షుమారు 45 సంవత్సరాలనాడు శతవృద్ధుడు రావి వారి పాలెం వాస్తవ్యులు రావి వెంకట్రామయ్య గారు. అనగా విన్నమాటలు నేను ఆనాడు రెవిన్యూ యిన్స్పెక్టరుగా శిస్తులు వసూలు సమయములో రావి వారి పాలెం శ్రీరాములవారి గుడిలో శిస్తువసూల్లు చేస్తుండగా చెప్పగా విన్న మాటలివి. అంతేగాక చివరకు విజయావాడ నుండి కరవు కాలువ గుండా వచ్చిన నీటిలో వరిసాగు చేసుకొని యిప్పుడు యిన్ని గంజి త్రాగి సుఖంగా ఉన్నామన్నారు. అంతవరకు యీ జమిందారు పరిపాలనలో వేళకు తిండి తిప్పలు లేక డొక్కలు ఎండగట్టుకొని జీవించామని చెప్పారు.

**9. గాంధి దర్శనం :** 1946 వ సంవత్సరములో గాంధి గారు మద్రాసులో దక్షిణ భారత హిందీ ప్రచారసభ ప్రారంబోత్సవ సందర్భంగా తెనాలి మీదుగా వెళ్ళేటప్పుడు తెనాలి రైల్వే ప్లాట్ ఫారం మీద చూడగలిగితిని ఆ రోజు జనము ఇసుక వేస్తే రాలనట్లు వచ్చారు, ఆనాడు రైలు పెట్టెల మీద కూడా కూర్చోని గాంధి గారిని చూడటానికి కృష్ణా గుంటూరు జిల్లాల ప్రజలు తండోపతండాలుగా విచ్చేసిరి. రైల్వే టిక్కెట్లు కూడా కొనలేదు. అదే సంవత్సరమై ఉండ వచ్చును. నేనున్నూ, చిరువోలు రాధాకృష్ణ మూర్తిగారున్నూ ఒకరోజు మోపిదేవి వరకు నడచివెళ్ళి మోపిదేవిలో బస్సు (బొగ్గుతో నడిపేవి) చార్జి బందరకు రు 0-9-0 (తొమ్మిది అణాలు) చొప్పున యిద్దరికీ రూ 1-2-0 ఒక రూపాయి రెండణాలు యిచ్చి పట్టాభిగారింటికి వెళ్ళగా వారు అప్పుడే భోజనం వద్ద కూర్చొని అన్నము కలుపుచుండగా వారి అమ్మాయి చూచి మీకొరకెవరో వచ్చారని చెప్పగా అన్నము కలిపేది ఆపి ఆ చేత్తోనే బయటకు వచ్చి మీరు వచ్చిన పని ఏమని అడుగగా మేము చెప్పినాము అప్పుడు వారు నేను మద్రాసుకు రైలుకు వెళ్ళుచున్నాను. టైము అయినది టాంగా (గుర్రపు బండి) వచ్చి రెడీగా ఉన్నది. నేను యిప్పటికి 6 రోజులకు తిరిగి వస్తాను. ఆ రోజున రండి మీ పని చేసి పెడుతాన న్నారు అలాగ భోజనము కలుపుచూ ఆ ఎంగిలి చేత్తో బయటకు వచ్చి దర్శనమిచ్చేవారున్నారా యిప్పుడు ? అని నేను

ప్రశ్నించుకుంటున్నాను. ఈ కాలములో అయితే ఎన్ని గంటలు వారి దర్శనము కొరకు ఎదురు చూడాలో అని అనుకుంటున్నాను. ఆ నాటి రాజకీయనాయకులది నిస్వార్థత. త్యాగబుద్ధి. ఈ నాడూ కూడా అటువంటి వారు లేకపోలేదు కాని బహుతక్కువ.

ఆ విధముగా రాజకీయాలలో ఉంటూ ప్రైవేటు స్కూలు నడుపుకొనుచూ, హౌమియో వైద్యశాస్త్రాలను చదువుకొని వైద్యము కూడా చేస్తూ ఉంటుండగా 1947 రానే వచ్చినది. మహాత్ముడు జిన్నాతో 18 రోజులు హిందువులు, ముస్లిములు కలిసి ఉండాలనే పోరాటము సాగించినా ఫలితము లేకపోయినది. పోతూ పోతూ బ్రిటీష్‌వారు చేసిన కుట్ర ఫలితంగా 15 ఆగుష్టు 1947 రోజున హిందుస్థాన్, పాకిస్థాన్ దేశాలుగా భారత దేశాన్ని చీల్చి స్వాతంత్ర్యము యిచ్చారు. తరువాత ఒకనాడు డా. స్వర్వేపల్లి రాధాకృష్ణ గారు గాంధి గారినియిలా చీల్చి స్వాతంత్ర్యము యిచ్చారుకదా! నీ అభిప్రాయమేమిటని అడుగగా, ఈ పద్ధతి నాకెంతమాత్రము యిష్టము లేదు. కాని నేను వృద్ధుడనైనాను. జవసత్వాలుడిగినవి. తరువాత శకంవారు అందరూ కలసి ఉండటానికి కృషి చేయవలసిందే నన్నారు. స్వాతంత్ర్యము వచ్చినది. నాకు వివాహము ది. 25-3-1948న నా 28వ యేట గుంటూరు జిల్లా యాజలి శివారు దమ్మనవారి పాలెం కాపురస్తులు ఆ గ్రామ పెద్ద రైతులలో ఒకరైన ఇమడాబత్తుని రామస్వామి గారి చతుర్థ పుత్రిక రాఘవాంబతో రేపల్లె తాలూకా అల్లపర్రు గ్రామములో వివాహము జరిగినది. అవి 5రోజుల, 3రోజులు, 3 పూటల పెళ్ళిళ్లరోజులు. నా పెండ్లి ఆ రోజులలో 3పూటలు పెండ్లి వారితో పాటు వారి పరివారము ఎడ్లు వగైరాలకు ఆతిధ్యము ఎడ్లుకు దాణా, గుగ్గిళ్ళు, మేత వద్దనుండి ఆడపెండ్లి వారిదే, పల్లకి, పల్లకి వెంట 25 బండ్లలో రేవుదాటి (ఆ యేడు పాటి రేవు) బంధుకోటితో ఒక్కసారిగా ఆనవాయితీ ప్రకారం పెద్దల సమక్షంలో అగ్ని సాక్షిగా, ది. 25-3-1948 వివాహము జరిగినది.

**10. ఉద్యోగము :** తదుపరి షుమారు 1950 సం॥లో పులిగడ్డలో ఉన్న యిద్దరు సబ్‌డివిజనల్ ఆఫీసర్సు కుమార్తెలిద్దరు 4త్ ఫారమ్ చదివేవారుకి ఉదయం పూట 1 గంట ట్యూషన్ చెప్పేవాడిని యాబూబెన్ యాడం నే హిజ్ ట్రైబ్ ఇంక్రీజు అనే యింగ్లీషు

గారు మీలాంటి వారి 15% ఉంటే దేశమెంగుకు బాగుపడదు అన్నారు. తరువాత ఆఫీసు ఇన్స్పెక్షను 2 సం॥ లకు ఒకసారి జిల్లా ట్రెజరీ ఆఫీసరు గారు చేసేవారు. నన్ను ఉస్టుచేసిన సందర్భములో ఇన్స్పెక్షను చేసి అందు నేను పంపించిన డైలీ జర్నల్సు, నెలవారి ట్రెజరీ ఎక్కౌంటు టి.డి.సి. ఆఫీసుకు పంపించిన వానిని పరిశీలించి నేను యింతవరకు చేసిన జిల్లాలో ఇలాంటివానిని చూడలేదు. అతడిని పిలిపించండి. నేను ఉద్యోగమిస్తానని ఆ ముస్లిం ఆఫీసరు అనగా నేను హైదరాబాదులో ఏజ్ ఎక్సుంషనుకు తిరుగుతూ కలుసుకోవడం ఆలస్యమైనది. అంతలో వారు ట్రాన్స్ఫరై వెళ్ళిపోయారు.నా దరఖాస్తు మీద గవర్నమెంటు నుండి కలెక్టరు ఆఫీసు రిమార్కులు అడిగాను. 1959 లో తిరిగి రెవెన్యూ డిపార్టుమెంటులో టెంపరరీగా ఉద్యోగమిచ్చారు. సదరు ఉద్యోగము చేస్తూ ఉండగా ఒకనాడు ఊస్టింగు వచ్చినది. వెంటనే కలెక్టరు ఆఫీసుకు వెళ్ళి అప్పటి కలెక్టరు గారు శ్రీ బి.సి. గంగోపాధ్యాయ గారికి దరఖాస్తు యిచ్చాను దరఖాస్తు చదువుతూ రాజగోపాలరావు నీకేమి కావాలని ఇంగ్లీషులో అడిగారు దాని మీద నేను ఎజ్‌బార్డ్ కాండిడేటును. 1951 జనవరి నుండి డిపర్టుమెంటులో టెంపరరీగా పని చేయుచున్నాను సర్వీసు కమీషనుకు కూర్చొనుటకు అనర్హుడను గవర్నమెంటు వారికి నాకు ఏజ్ ఎక్షంప్షను యివ్వవలసినదిగా దరఖాస్తు చేసుకున్నాను. అది పెండింగులో ఉన్నది. ఇంతలో యీరోజు ఊష్టింగు వచ్చినది అని చెప్పి

I request the collector that I may kindly be continued till the orders of government are received on my petition. Then the collector questioned me if the Government won't consider your case who will take the risk ? then I replied that I shall give it in writing to the benovolent collector that I won't take my pay till the orders of Government are received on my petition. Then he said that won't do. If you work you must be paid. It is a statutory rule. You can go.

అని అనగా నేను మేడదిగి వస్తిని నా దరఖాస్తు మీద Continue చేయుమని వ్రాసి

పంపగా నాకు వెంటనే Huzur Sheristar గా ఉన్న శ్రీ అడుగుమిల్లి వెంకటరత్నంగారు ఆర్డర్లు యిచ్చి పంపినారు తిరిగి అదేరోజు నాలుగుగంటలకు అవనిగడ్డ ఆఫీసుకు వచ్చి ఆర్డర్లు చూపించి నా పని నేను చేసుకొనుచుండగా నా దరఖాస్తు ఎంక్వయిరీకి రావడము, తహసిల్‌దారు. డిప్యూటీ కలెక్టరు గారలు నా అర్హత నా పనితనము వివరించుచూ రికమండ్ చేయగాజిల్లాకలెక్టరు శ్రీ బి.సి. గంగోపాధ్యాయ గారు చివరి పేరాలో It is not desirable to through him out of service in the middle of his age. He has got consistantly good record. He is well acquinted with revenue work. His is the best case for the relaxation of age rule. అని రికమండు చేయగా గవర్నమెంటువారు When there are surplus of graduates wondering in the bazars with no jobs where is the need to give age exemption to the matriculate candidate అని కలెక్టరుగారే He is more than a graduate service commitioned candidate అని త్రిప్పిపంపగా శ్రీ గవర్నమెంటు వారు 1961 లో నాకు ఏజ్ ఎక్జంప్షన్ యిచ్చియున్నారు. నేను వెంటనే దరఖాస్తు చేయగా 1963 లో సర్వీస్ కమిషను వారి పరీక్ష జనవరి 11,12 తేదీలలో జరుపు సందర్భములో నా దరఖాస్తును వయసెక్కువైనందున తిరస్కరించబడిన ఉత్తర్వులు నాకు 1-1-1963 న అందినవి. వెంటనే నా వద్ద ఉన్న జి. ఓ. ను తీసుకొని సర్వీస్ కమిషను శక్రటరీ గారిని కలువగా మా ఆఫీసుకు జి.ఓ. రాలేదన్నారు. దానిని తీసుకొని వస్తే వెంటనే Hall ticket ఇస్తామన్నారు. వెంటనే నేను సెక్రటేరియట్‌కు వెళ్ళి అచ్చట పనిచేస్తున మా దగ్గర బంధువైన భోగాది వెంకటేశ్వరరావుకు చెప్పగా Spare copy G.O. ను సూపరింటెండు సంతకము చేయనది ఉన్నదని చెప్పి ఆ సెక్షను గుమస్తా రామ రత్నము నుండి యిప్పించారు. అది సర్వీసు కమిషను ఆఫీసుకు తీసుకొని వచ్చి Deputy Secratary గారికి చూపించగా వారునాకు hall ticket యిచ్చి మీ examination centre కు సోమవారం టెలిగ్రాము యిస్తామన్నారు. నేను 11,12 తేదీలలో బందరులో పరీక్షకు హాజరై సెలక్టైతిని. సి.ఐ.డి. వారు నా Anticidents కనుగొని

రిపోర్టు చేయగా Director of Technical Education వారు తమ ఆఫీసులో వేసినట్లు నాకు ఆర్డర్లు పంపించారు. నేను వెళ్ళుదామనుకున్నాను. నా సహోద్యోగులు నీకు యింకా 15 సంవత్సరాలు కూడా సర్వీసు లేదు ఇచ్చట L.D.C. గా రిటైరైనా ప్రశాంతంగా ఉంటుందని. చెప్పగా నేను కలెక్టరు గారిని యిందులోనే రిటైర్ చేయవలసినదని కోరగా వారు ది 24-6-1964లో రెగ్యులర్ అప్పాయింటు మెంటు యిచ్చియున్నారు. వెంటనే అన్నీ Revenue Tests ప్యాసైనాను, Survey Training యిచ్చి మొదటగా నిడుమోలు ఫిర్కా రెవెన్యూ యిన్స్పెక్టరుగా పోస్టింగు ఇచ్చియున్నారు. అచ్చటనే 1 సంవత్సరం 4 మాసాలు రెవెన్యూ యిన్‌సెపక్టరు గిరీ చేయగా నన్ను అప్పటి కలెక్టరు Jaikar P. Johnson గారు 1967 లో ప్రమోషనిచ్చి upper division clerk గా అవనిగడ్డ తాలూకా ఆఫీసులోనే వేశారు. తరువాత నేను లంకపల్లి, నిడమోలు, అవనిగడ్డ, కోడూరు, నాగాయలంక ఫిర్కాలకు రెవిన్యూ యిన్స్పెక్టరు చేశాను. రేవు అవతల ఉన్న పెదయాదర, చ్నియాదర, వాడపాలెం అనే గ్రామలు కోడూరు ఫిర్కాలో ఉండేవి. ఒకనాడు వాడపాలెంలో శిస్తు వసూలు చేసెట్టప్పుడు వాడపాలెం గ్రామసరిహద్దులో పొలములో చావడి వేసుకొని ఎడ్ల పశువులతో ఒక ముసలాయన కనిపించగా యీన రూ 1600-00 పదహారువందలు శిస్తు బాకీఉన్నదని చెప్పగా వెళ్లి అడగండి అన్నాను. నన్ను వేలుతో చూపుతో ఆయనెవరని అడిగారు. వారు మా రెవన్యూ యిన్స్పెక్టరుగారున్నారు. అయితే వారిని కూడా రమ్మనండి అనగానేను పంటకోడుదాటి వెళ్లాను వారు అనవాయితీ ప్రకారం నమస్కారము చేశారు. నేను ప్రతినమస్కారము చేసి వారు వెసిన కంబారుత్రాడు మంచముమీద కూర్చొనగా రెవిన్యూ ఇన్స్పెక్టరుగారిది ఏవూరండి అని అడిగారు. మాది పులిగడ్డ అన్నాను అయితే కర్ణంగారి తాలూకా అని అడిగారు కాదన్నాను. మరెవరి తాలూకా అని అడుగగా మునసబుగారి తాలూకా అన్ని చెప్పితిని. అయితే మీ తాలూ కేశవరాయుడుగార, అయితే కేశవరాయుడు గారికి ఎన్నోకుమార్డు అని చెప్పగా మూడవ కుమార్డు పేరు లక్ష్మయ్య గారని చెప్పగా అయ్యా మీకు మాకు పూర్వము నుండి మంచి సాన్నిత్యము ఉన్నదని చెప్పి మికుకొక్కరి గడ్డ గ్రానుపరిధిలో య 200 భూమి ఉండి

యున్నది. మీ కాడి గట్టున మాకు రూ 50 ఉన్నదట అంతమెట్ట భూమే. మీ భూమి 200 ఎకరాలు నువ్వూ పిల్లిపెసర, కందివేశారు. ఆ సాయంత్రము నిగామాను వెళ్లిచెప్పగా మనప్రక్కన ఉన్న నాదెళ్ల జనయ్యగారి పొలములో ఏమివేశారని అడుగగా వారి ఎడ్లకు గాళ్ళు తగిలినవట. ఏమివేయలేదన్నరట. వెంటనె ఇప్పుడు పెద్దప్రోలు వెళ్లి జనయ్య గారిని ఉదయమే 50 ఎకరాలకు వితనాలు తీసుకురమ్మని చెప్పి నన్ను అక్కడ ఉన్న 60 నాగళ్ళలో వారి పొలముకూ విత్తనాలు వేసి తదుపరి మరో లంకవిత్తనాలు వేయమనగా వారు 50 ఎకరాలకు విత్తనాలు తీసుకురావడం మా నాగళ్ళలో 2 చాళ్ళు దుక్కదున్ని లోడగులో 10, 11॥ గం లకు మరొక లంకకు నాగల్లు తోలించుకొని వెళ్ళారట. మీకు మాకు లోగడ ఉన్న అవినాభావ సంబంధమది. ఇప్పుడు మీరెవరో మేమెవరమో తెలియుట లేదని చెప్పి శిస్తు పూర్తిగా చెల్లించి మమ్ములను పంపించినారు. వారి మనుమడు పేరు (గుర్తుకు లేదు) ఇప్పుడు కూడా నేను కనబడితే చాలు స్కూటరు ఆపి దిగి యోగక్షేమాలు తెలుసుకొని వెళుతుంటారు వారు కమ్మవారు మేము కాపులము కులములు వేరైతే కావచ్చు కాని మా గ్రామం చుట్టుప్రక్కల ఉన్న కమ్మవారంతా మైనేని, ముమ్మనేని, గద్దే, పరుచూరు, కంఠమనేని, రావి మరియు వేములపల్లి ఇంటిపేర్లు గలవారు వావివరుసలతో పిలుచుకొనే సాంప్రదాయం ఇప్పటికీ ఉన్నది.

1969 లో రివర్షన్ రాగా సెలవు పెట్టాను. ఆ సెలవు అనంతరము Dy Commisioner of Excise కృష్ణాజిల్లా కలెక్టరు గారిని కొంతమంది experienced clerks ను యిమ్మని కోరగా నన్ను ఆ Excise Department కు బదిలీ చేశారు, నాకు ఆ డిపార్టుమెంటు అంటే పడదు. నాకు కొన్ని నియమనిబంధనలున్నవని కోరగా కొద్ది కాలము చేసిన తదుపరి మారుస్తామన్నారు. కాని ఎక్సైజ్ సూపరింటెండెంట్ శ్రీ ఆర్. రామచంద్ర గారు నేను ఉన్నంత కాలం ఉండు నీకు ట్రాన్స్ఫరు యిప్పించి నేను రిలీవ్ అవుతానని ఒప్పించి పనిచేయించుకున్నారు వారు ట్రాన్స్ఫర్ అయి వెళ్ళారు. కాని నాకు ట్రాన్సుఫర్ రాలేదు. తరువాత వెంకట రెడ్డి గారు వచ్చారు.వారు కూడా అలాగే అన్నారు. ట్రాన్సఫర్‌య

వెళ్ళారు. నాకు ట్రాన్స్‌ఫర్ రాలెదు. తరువాత వెంకట రామ రెడ్డి గారు వచ్చారు. వీరు కూడా నన్ను ఈ డిపార్టుమెంటులోనే ఉండమనిన్ని సబ్‌యిన్‌స్పెక్టరు యిప్పిస్తానని ఆశపెట్టిరి. అయినా నేను నా పట్టు వదలనన్నాను. చివరకు మీరీ డిపార్టుమెంటు నుండి వెళ్ళిపోతే తను కూడా మరునాడే మెడికల్ లీవ్ పెట్టి వెళ్తానన్నారు. కాని నా నిర్ణయాన్ని మార్చుకోలేను. అప్పటి కలెక్టరు ఆఫీసు పి.యే. గారిని కలిసినన్ను నా డిపార్టుమెంటుకు ట్రాన్స్‌ఫర్ చేయమని కొరగా, అందరూ Excise Department కావాలని కోరుకుంటుంటే మీరు ఆ డిపార్టుమెంటు వద్దంటాదేమిటని ప్రశ్నించారు. నేను స్వాతంత్ర్య సమరములో పాల్గొన్న వ్యక్తిని గాంధిగారి సిధాంతాలను చదివి వంటబట్టించుకున్న వాడిని. ఆ డిపార్టుమెంటు నాకు వద్దు అని చెప్పి 1944 అక్టోబరు 2వ తేది గాంధీ గారి 75 వ జన్మదిన తేదీన వారికి ప్లాటినం జూబ్లీ చేయగా వారు ఆ నాడు ఒక మెస్సేజి యిచ్చారు. ఆమెసెజిని ఇంతకుముందే వ్రాసినాను. నా సమాధానము విన్న ఆ పి.యే గారు నన్ను మళ్ళీ రెవెన్యూ యిన్‌స్పెక్టరు గా చల్లపల్లి వేశారు. అది చూచి **M.J.S. Murthy** అనే బందరు డిప్యూటీ కలెక్టరు గారు నాగాయలంక ఫిర్కాలో ఎన్నో ఏళ్ళ నుండి పాత బాకీలు పేరుకొని పోయి ఉన్నవని నన్ను నాగాయలంక మార్చినారు, నాగాయలంక ఫిర్కా అందరకీ భయమే. అక్కడ పని చేసే వారు సెలవు పెట్టి వెళ్ళిపోయినారు. ఖాళీగా ఉన్నది. ఎవర్ని వేసినా వెళ్ళనంటున్నారు. అందువల్ల నన్ను వేసినట్లు తెలియగానే అందలి గ్రామాధికారులు కొందరు అప్పటి కలెక్టరుగారు శ్రీ కుమార స్వామిరెడ్డి గార్కి మా ఫిర్కాకొక కాంగ్రెస్ వాడిని ఆర్.ఐ. గా వేశారండి. ఆయన మా కొద్దు. మరొకరని వేయించమని వేడుకొనగా, ఆ కలెక్టరు గారు వెంటనే డిప్యూటి కలెక్టరు గారికి ఫోను చేసి ఎవరితను ? అటువంటి వారిని ఎందుకు వేశారని అడుగగా మూర్తిగారు ఈ రెవిన్యూయిన్‌స్పెక్టరు లోగడ నావద్ద పని చేసినాడు. **He is a strong man** అనిన్నీ ఈ ఫిర్కా గ్రామాధి కారులంతా ప్రతి చిన్న విషయానికి రభస చేసి రాష్ట్రవ్యాప్తిగా దస్త్రాలు కట్టివేయించి, పనిని స్తంభింపచేస్తారనగా ఆ గ్రామాధికారులకు ఆ కలెక్టరు గారు ఆయన జయిను అయినాడు గదా ! కొంత కాలము తరువాత ట్రాన్స్‌ఫర్ చేస్తానన్నారట. కాని

నాగయలంకలో గ్రామ చావడికి తాళము వేసుకొని జవానును కూడా కనబడనీయ లేదు. నేను నాగాయలంక మునసబుగారి మేడ మీద కూర్చొని సాయంత్రము కాగానే తాలూకా ఆఫీసుకు వచ్చి తహసిల్‌దారు వారితో జరుగుచున్న విషయాలు ఏరోజుకారోజు చెప్పుచుంటిని. నేను నాగాయలంక వచ్చినట్లు, సెంటరులో మునసబుగారి మేడ మీద ఉన్నట్లు తెలుసుకొన్నారు. కానీ ఎవరూ నా వద్దకు రాలేదు. 3 రోజుల తరువాత జవాను వచ్చి నన్ను కలుసుకున్నాడు. గ్రామ చావడి తలుపులు తెరిచాడు. రికార్డులు ఎక్కడి వక్కడ ఉన్నవి. విషయాలన్నీ తహసీల్‌దారు మొహిద్దీన్ గారికి చెప్పితిని. భావదేవరపల్లి, చోడవరం, కమ్మనమోలుగ్రామ మునసబు గిరిలు ఖాళీగా ఉన్నవి. ఎవరిని వేయలేదు. ఇంతలో శిస్తు వసూళ్ల స్పెషల్ డ్రైవ్ వచ్చినది. మిటింగులో టార్గెట్లు యిచ్చారు. 3 మునసబు గిరిలు ఖాళీగా ఉన్నవని చెప్పాను. భావదేవరపల్లికి మూమ్మారెడ్డి అంజయ్యను, చోడవరానికి బెజవాడ వెంకటేశ్వరరావు గౌడను, కమ్మనమోలుకు నాగిడి శ్రీ హరిని (అగ్నికులు క్షత్రియుడు) వేసి రెక్టిఫికేషన్‌కు పంపగా తహసిల్‌దారుగారు నా మీద చీర్జిమోపి సంజాయిషీ అడిగినారు. మీరు ట్జార్జెట్లు యిచ్చారు. మునసబులు లేకుండా ఎలా వసూలు చేసేది ? నేను వేసిన వాళ్ళు మునసబు గిరీకి కావలసిన అర్హతలు కలవారే. నేనేమి సమాధానమివ్వలేను. నేను గవర్నమెంటు శిస్తు వసూళ్ల నిమిత్తం అర్హత కలవారిని వేశాను. నేనెవరి వద్దా లంచము తీసుకొని వేయలేదు. మీ యిష్టమొచ్చిన పనిష్మెంటివ్వండి అని ఊరుకున్నాను. ఆ స్పెషల్ డ్రైవ్‌లో నేను చేసిన వసూళ్ళకు విస్తుపోయి ఆర్.డి.ఓ. శ్రీ మూర్తిగారు నా పరువు నిలబెట్టావని నాగాయలంక గ్రామ చావడి వద్ద జరిగిన మీటింగులో వసూళ్లు రెవ్యూ చేస్తూ సెలవిచ్చారు. అదే చాలుననుకొని నేను ట్రాన్స్‌ఫరు కోరగా తహసిల్‌దారు మొహియుద్దీన్ గారు తన ఆఫీసులోనే వేయించుకున్నారు. అప్పటి నుండి వివిధ హొదాలలో పనిచేస్తూ చివరకు హెడ్ గుమాస్తాగా 31-8-1977న రిటైరైనాను.

1976 లో రిటైరె కావలసినది ఒక సంవత్సరము స్కూలు రికార్డులలో జనన తేదీ 1921 కి బదులు 1922 వ సంవత్సరం అని పడినందుకు 1977 లో రిటైరైనాను. నా

23 1/2 ఏండ్ల ఉద్యోగ ధర్మములో అడుసుమిల్లి వెంకటరత్నం గారు డిప్యూటీ కలెక్టరు హోదాలో రిటైరై 89 సంవత్సరాల వయస్సులో ఉన్నారు వారు నిష్కళంకమైన, నిరాడంబరమైన నీతినియమాలుగల ఆఫీసరు. వారిని 17-12-1999 న పెన్షనర్సు అసోసియేషన్ మీటింగులో కలిసినప్పుడు కుటుంబ విషయాలు మాట్లాడుకున్న తరువాత రాజగోపాల రావు ! తహసిల్దార్ అన్నా కాకుండానే రిటైరైనావా అని బాధపడ్డారు. టైము లేదుగదా అని విన్నవించాను.

నేను రిటైరయ్యేలోపు 1975 మే 30వ తేదిన నా పెద్దకుమార్తె నాగమలేశ్వరికి వివాహము చేసితిని. అతను బి.ఏ. పాసైనాడు 23 సంవత్సరాల వయస్సు తల్లిదండ్రులు ఇంకా ముగ్వురు చెల్లెళ్లు వివాహము కానివారు ఉన్నారు. ఆస్తి య 1-15 మాత్రము ఉన్నగని మా వియ్యంకుడే నరసయ్యగారు నిజముచెప్పినాడు లేచివారి చేతిలో చేయివేసినాను. అయితే మీ అబ్బాయికి మా అమ్మయినిస్తానని నాకు ఒకధైర్యము నావెనుక మండలి కృష్ణారావు ఉన్నారనే ధైర్యము. విషయము అప్పటి విద్యామంత్రి మండలి వెంకట కృష్ణారావుకు చెప్పగా కుఱ్ఱవానిని నన్ను కూడ చూడనివ్వు అని రెండవ తేదికి ఇక్కడకు వస్తాను. వారిని పిలిపించు మాట్లాడదామన్నారు. అలాగే పిలిపించి వారిని అగురునీద కర్చోబెట్టి లోపల్కివెళ్లి చెప్పాను. వారు బయటివచ్చి కుఱ్ఱవానిని చూడగనే శాబాష్‌నేనవరికి ఉద్యోగము ఆశ చూపెట్టలేదు. ఐనా నీకు మాత్రము ఉద్యోగ బాధ్యాతనాది అని చెప్పి తతిమ్మ విషయాలు మీరు మాట్లడుకోండి అని చెప్పి వెళ్లుచూ పై అడ్రసు లేకుండా నాలుగు దరఖాస్తులు తీసుకొని పంపించమని చెప్పగా అట్లు చేసితిని కట్నములేదు, పెండ్లి ఖర్చులు లేవు రెండు వేలుయిప్పించమన్నారు. అలగే యిచ్చి ది ॥ 30-5-1975 న వివాహము జరిపించితిని సరిగా నెలరోజులకు విజయవాడలోని సి ఎల్. మ్.బి. బ్రాంచిలో గుమాస్తాగా రూ 180/- జీతము మీద వేసి ఆర్డరు శ్రీమతి ప్రభావతి కృష్ణారావు గారు హైదరాబాదు నుండి వచ్చి నాకందజేశారు దీనిని నా అలునికి అందజేసి రూ 180 జీతమని వెరవకు. కొద్ధి రోజులలో నిండు జీతమొస్తుందని అంతవరకు నీకుకావలసిన డబ్బు నేనిస్తాని చెప్పి జాయిన్ చెయించాను. 5,6 మాసాలలో జీతము 750 రూపాయలకు

పెరిగినది. అందుకు వారి భార్యభర్త లిరువురికి కృతజ్ఞతలు నా జీవితములో ఇది మరువరాని ఘటం. ఇప్పటికి అతను తన ముగ్గురు చెల్లెళ్ళ పెండ్లి చేశారు. తెనాలిలో యిల్లు కట్టుకొన్నారు. సుఖఃగానే ఉన్నారు. ఆ కుటుంబం వారి కుమార్తె శేషుకుమారి బి.ఫార్మసి 4వ సంవత్సరము చదువుచున్నది. రేపు ఆగష్టుసో ఫైనల్ ఎగ్జామినేషన్ వ్రాస్తుంది. కుమారుడు ఇంటర్ మీడియెట్ చదువుచున్నాడు. వాని పేరు నరేష్.

అప్పటి జీతాన్ని బట్టి, సర్వీసు కాల పరిమితిని బట్టి నాకు నెల 1కి పెన్షను రూ. 97.00 మాత్రము శాంక్షను కాగా, సెప్టెంబరు నెల అనగా మొదటి నెల పెన్షను 1-10-1977 నే తీసుకొని చరిత్ర సృష్టించాను ఇప్పుడు రాష్ట్ర ఉద్యోగ సంఘాల ఐక్యతా కృషివల్ల షుమారు రు. 1600-00ల నెలవారీ పెన్షను తీసుకుంటున్నాను. నేను సత్యము ధర్మాన్నే నమ్ముకున్నానని అక్కడక్కడా విన్నవించుకున్నాను. దానికి దృష్టాంతముగా రెండు సందర్భాలు ఇచ్చట విశదీకరిస్తున్నాను. 1. నేను లంకపల్లి ఫిర్కా రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగా చేసేటప్పుడు అదివరకే మంగళాపురం పంచాయితీ ఎన్నికలప్పుడు కాంగ్రేసు వారు చనిపోయిన ఓటరుకు బదులు మరొకరితో ఓటు వేయించారని కమ్యూనిష్టు పార్టీ అభ్యంతరము దానిని కలెక్టరు వారి వద్దనుండి తాసిల్దారు శర్మగారికు పంపగా నాకా రెఫెరెన్సు పంపిస్తూ ఎంక్వైరీ చేసి నిజానిజాలను రిపోర్టు చేయమన్నారు. మంగళాపురం అంటే కమ్యూనిష్టు పార్టీకే కేంద్రము. దివంగత చంద్ర రాజేశ్వర రావు గారి స్వగ్రామము నేను టంకు వేయించి గ్రామ చావిడి వద్ద మీటింగువద్ద మీటింగు పెట్టాను. గ్రామము మున్సబు, కర్నాలు రికార్డులతో వచ్చారు. మరణ రిజిస్టరు చూసాను. చచ్చిపోయిన తారీఖు మార్చినట్లు ఉన్నది. దరఖాస్తుదారు చంద్ర రాజేశ్వర రావు గారి అబ్బాయి. వారి వద్ద ఒక స్టేట్ మెంటు కాంగ్రేసు పార్టీ వారి వద్ద ఒక స్టేట్ మెంటూ తీసుకొన్నాను. రాజేశ్వర రావు గారి అబ్బాయి ఉద్రేకముతో ఈ కాంగ్రేసు పార్టీవారు ఇచ్చిన స్టేట్ మెంటు మీద తాను సాక్షిగా సంతకము చేయాలని వాదనకు దిగాడు, అప్పుడు నేను నన్ను పైవారు ఎంక్వైరీ ఆఫీసరుగా వేసారు నా మీద నమ్మకము ఉన్నది కదా అందు అపోజిషన్ పార్టీవారి సంతకము తీసుకోమని లేదే వారు ఏమి చెప్పారో అదే

వ్రాసాను. చదివి వినిపించాను ఇంకెందుకు అనగా తరువాత మీరు మార్పు చేయవచ్చుగదా అన్నారు. అలాంటి మధ్యవర్తి సంతకమునకు ప్రానిజను లేదు ఉంటే మాసెట్టండనగా మాట్లాడలేదు. అందు కాంగ్రేసు పార్టీవారు గ్రామ మున్సబుగారిని లోబర్చుకొని మార్పుచేసినట్లు స్పష్టముగా కనబడుచున్నది. అయినా నీ అభిప్రాయమును కూడా వినియోగించండి అని వ్రాసాను. నేను లంకపల్లిలో కాపురముంటున్నాను, స్వాతంత్ర్య సమరయోధుడను అనగా కాంగ్రేసు వాడిని గదా అనుకొని ఆ రాత్రి రెండు వర్గాలు నా వద్దకు వచ్చి నన్ను లోబర్చుకొను చూసారు కాని నేనెవరికీ లొంగలేదు. విషయము కమ్యూనిస్టు పార్టీకి అనుకూలముగా నున్నది అలాగే పంపాను. నాల్గైదు రోజుల తరువాత కమ్యూనిస్టు పార్టీలో ఒక పెద్ద గోపాలరావు నగైరాలతో వచ్చి ధర్మబద్ధము గా వ్రాసి మండలి వారి అబ్బాయివని అనిపించుకున్నావని స్లాఘించారు. 2. నేను తాలుకా ఫీసు హెడ్‌గుమాస్తాగా చేస్తున్నాను. ఒకరోజు కమ్యూనిస్టు నేత సనకా బుచ్చికోటయ్యగారు వచ్చి ఆఫీసులో ఈ గదినుండి ఆగదికి తిరిగారు బుచ్చికోటయ్యగారు ఏదో పని మీద వచ్చారు అని అడుగగా దగ్గరకు వచ్చారు కూర్చోమన్నాను. ఒక భూమి తగాదా కాగితము కాంగ్రేసు కమ్యూనిస్టు పార్టీలకు నీకొత్తపాలెం గ్రామం సరిహద్దులోనిది ఒక భూస్వామి తన భూమి ప్రక్కన ఉన్న భూమిని ఒక పేదవాడు పది సంవత్సరములనుండి చేసుకుంటున్నాడు ఈ సంవత్సరము ఆ పేదవాన్ని ఆ చేను వద్దకు రానివ్వడం లేదు. రిపోర్టు రెవెన్యూ ఇన్‌స్పెక్టరు గారినుండి వచ్చినది. దానికి సంబంధించిన కాగితాల్ని వెలికితీసి నాముందు పెట్టాడు. ఫైలంతా పరిశీలించాను నీవు వ్రాయిలేక పోతే కట్టకట్టి ఫైలు నాకివ్వు అని చెప్పి బుచ్చికోటయ్యగారిని ఇంకొక నాలుగు రోజులకు రండి అన్నాను. ఆ ఫైలు క్షుణ్ణంగా చూచి నోటు వ్రాస్తిని పేద రైతు పదిసంవత్సరములనుండి సాగు చేసుకుంటూ బి.ఫారమ్ శిస్తు కట్టుచున్నాడు. ఇతరత్రా భూమిలేదు అవతల రైతుకు 20 ఎకరాల భూమి ఉన్నది. ఈ సంవత్సరమే అడ్డము వచ్చినాడు. విషయాలన్ని వ్రాసి తాసిల్దారు గారికి పంపించాను. పేదరైతు ఈ భూమిని కౌలుకు ఇమ్మని పోరాడుచూనే ఉన్నాడు. తాసిల్దారు గారు శివాయి జమాదారైన పేదరైతుకు ఈ సంవత్సరము లీజుకు

ఇమ్మని ఆర్డరు వేసారు. ఆర్డరు అప్రూచేయించి టైపు చేయించి ఫైలు నాదగ్గరే ఉంచాను. బుచ్చికోటయ్యగారు వచ్చారు లీజు ఆర్డరు కాగితాన్ని ఇచ్చి సంతకము చేయించుకున్నాను. సంతోషించి నూ పార్టీ వస్తే మీకు డెప్యూటీ కలక్టరు ఇస్తానన్నాడు. అందు నేను ధర్మబద్ధంగానే వ్యవహరించాను మీపార్టీ అధికారంలోకి వచ్చేది లేదు నాకు డెప్యూటీ కలక్టరు ఇచ్చేదిలేదు. అలాయిస్తే మిమ్ములను మీపార్టీ హతమారుస్తుంది అన్నాను త్యాంక్స్ అని చెప్పి వెల్లిపోయారు.

## 11. స్వచ్ఛంద సేవా వృత్తి :-

ఇదిలా ఉండగా ది. 29-8-1977న 9 గంటల సమయములో నాకు ఫోను వచ్చినది. అది మండలి వెంకట కృష్ణరావు గారి వద్ద నుండి. నన్ను ఫోనులో రిటైరవుతున్నారట గదా ! ఎప్పుడు ? అని అడుగగా రేపు 31 సాయంత్రము అన్నాను. ఒక్కసారి యింటికి వచ్చి వెళ్ళమనగా సైకిల్ వేసుకొని వెళ్ళాను. ఎంతో మంది ఉన్నారు. నన్ను కూర్చోమన్నారు. ఒక అరగంట వరకు ఏమీ మాట్లాడలేదు. నేనులేచి టేబులు మీద చెస్టు అనగా స్టాఫ్‌కు అడ్వాన్సులు, జీతాలు, టి.ఎ.లు. ఇంకా కొన్ని మిస్‌లేనియస్ పేమెంట్సు ఉంటాయి. అట్టి దానిని టేబిల్ మీదే వదిలేసి వచ్చాననగా ఇంకా 2 నిమిషాలలో నిన్ను పంపిస్తానని తన వద్ద ఉన్న చిన్న, పెద్దలను పంపించి నాతో పాటు పురుషోత్తము రావు అనే పి.డబ్ల్యు.డి. యింజనీరును వెంటబెట్టుకొని సాగి నిన్ను ఈ గాంధీక్షేత్రానికి మేనేజరుగా వేస్తున్నాను. 1-9-77 న వచ్చి చేరవలసినదిగా కోరి ఈ యింజనీరు గారు నీకు కావలసిన సలహాసంప్రదింపులకు అందుబాటులో ఉంటారు అని చెప్పగా నేనేమీ మాట్లాడకుండా తిరిగి తాలూకా ఆఫీసుకు వెళ్ళి నా సీటులో కూర్చొని ఆలోచించటం మొదలు పెట్టాను. నాకు అప్పటికి మగపిల్లలు గాని, ఆడ పిల్లలు గాని అక్కరకు రాలేదు. పెద్దమ్మాయి నాగమల్లేశ్వరికి 1975 మే 30వ తేదిన వివాహమైనది. 2వ అమ్మాయి శేషుదుర్గాంబ మాత్రము బి.కామ్. 3వ సంవత్సరము బందరు హిందూ కళాశాలలో చదువుచున్నది. పెద్ద కుర్రవాడు రమేష్‌బాబు ఇంటర్ 2వ సంవత్సరము చదువుతున్నాడు.

ఇంకా అంతకన్నా చిన్నవాళ్ళు 3 మగపిల్లలు, ఒక ఆడపిల్లా ఆననిగడ్డ హైస్కూలులో చదువుచున్నారు. మూడవ కుమారుడు రామిరెడ్డి. ఇతడు ఇంటర్మీడియట్ పరీక్షలు వ్రాసిన తరువాత రిజల్ట్సు రాకమునుపే జబ్బుచేసి బందరు గవర్నమెంటు హాస్పిటల్‌లో చనిపోయినాడు. చనిపోయిన 2 రోజులకు ఉత్తీర్ణులైన లిస్టులో అతని నంబరు ఉండి యున్నది. ఏమి లాభము. దురదృష్టవంతులము. రిటైరైన తరువాత గ్రాట్యూటీ, జి.పి.ఎఫ్, లైఫ్ యిన్సూరెన్సు, 3 నెలల యెరన్డ్ లీవుకు కలిపి రూ. 11,000-00 పదకొండు వేలరూపాయలు వచ్చినది అప్పటికి ఒక్క అమ్మాయికి మాత్రమే వివాహమైనది యింకా యిద్దరు ఆడపిల్లలు, నలుగురు మగపిల్లలు చదువులు, వివాహాలు పూర్తి కావలసి ఉన్నవి. ఇన్ని బాధ్యతలున్నా నేను 1-9-1977 న అనగా రిటైరైన మరునాడు గాంధీక్షేత్రములో మేనేజరుగా ప్రజాసేవలో చేరితిని. నాతో పాటే గాంధీక్షేత్రములో పనిచేసి శ్రీ కె. వెంకట రత్నం అనే రిటైర్డు పోలీస్ సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారు నా కెంతో సహాయసహకారాలందించారు వారికి నా కృతజ్ఞతలు.

అప్పటి నుండి గాంధీక్షేత్రమును దిన దిన ప్రవర్థమానముగా తీర్చిదిద్దవలసి వచ్చినది. ఇది స్వచ్ఛంద సేవాసంస్థ. అందులో అప్పటికి 40 మందితో అనాధశరణాలయము, 40 మందితో హిందీ టీచరు ట్రైనింగు స్కూలు, 60 మందితో ఒక హరిజన హాస్టలు నడుప బడుచున్నవి. ఇంతలో ది. 19-11-1977న దివిసీమకు ఉప్పెన వచ్చినది. ఆ ఉప్పెనలో షుమారు పదివేల మంది జనాభా కొట్టుకుపోగా, వేలాది పశువులు చనిపోయినవి. ఈ ప్రళయములో యిళ్ళు కొట్టుకుపోగా తీరప్రాంత ప్రజలంతా నిరాశ్రయులైరి. వారిని శ్రీ కృష్ణారావుగారు. ప్రభాకర్ జీ మొదలైనవారి సూచనల ప్రకారం రోజుకు షుమారు పదివేల మందికి గాంధీక్షేత్రములో నివాసము, భోజన సదుపాయములు సమకూర్చబడినవి. ఈ ప్రళయానికి యావత్ భారతదేశ రాష్ట్ర ముఖ్యమంత్రులు, అమెరికా, ఇంగ్లాండు, జర్మని, ఆస్ట్రేలియా మొదలగు దేశనాయకులు వచ్చి ప్రజలను ఓదార్చి బాధితులకు వస్త్రాలు, వంట సామగ్రి వగైరా తెచ్చి గ్రామగ్రామాన పంచగా కొన్ని సంస్థలు యిళ్ళుపోయిన వారికి యిండ్లను కట్టించి, గ్రామగ్రామానా కమ్యూనిటీ షెల్టర్లను

కట్టించి దివిసీమ ప్రజలను ఆదుకొన్నారు. ఆ సమయములో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు. వారు ఎప్పటి కప్పుడు పర్యవేక్షణ జరిపి బాధితులకు సహాయ సహకారములందించిరి. ప్రధాన మంత్రి మొరార్జీ దేశాయి, భారత దేశ ప్రెసిడెంటు శ్రీ నీలం సంజీవరెడ్డి గారలు దివిసీమను సందర్శించి బాధితులను ఓదార్చిరి. శ్రీమతి ఇందిరాగాంధీ రెండు ధఫాలుగా విచ్చేసి గాంధిక్షేత్రములో మీటుంగుపెట్టి బాధితులనోదార్చిరి. భర్తలు పోయిన భార్యలకు, భార్యలు పోయిన భర్తలకు ద్వితీయ వివాహాలు, సామూహిక వివాహాలు, మంగళ సూత్రాలు, బట్టలతో సహా యిచ్చి జరిపించితిమి. ఆ వివాహాలకు ఎన్.టి.రామారావు, ఎ. నాగేశ్వరరావు మొదలైన సినీ ప్రముఖులు కూడా హాజరై వధూవరులను ఆశీర్వదించిరి. ది 2-10-1944 కు గాంధి గారికి 75 సంవత్సరములు నిండిన సంధర్భముగా భారత దేశమంతా పెద్ద ఉత్సవం చేసారు. మేము అవనిగడ్డలో 75 ఎడ్లబండ్ల మీద ముందు బండిమీద గాంధీ గారి ఫోటో పెట్టి ఊరేగించితిమని చెప్పానుగదా ! ఆ నాడు వారు ఇచ్చిన సందేశము ఇంతకు ముందే వ్రాసియున్నాను. 1997 లో మన భారత దేశ ప్రజాస్వామ్యానికి ప్రెసిడెంటుగా శ్రీ కే. ఆర్. నారాయణన్ గారిని నియమించగా నేను వారికి అభినందనలు పంపిస్తూ గాంధి గారు ది 2-10-1944న యిచ్చిన మెస్సేజి లోని మొదటి వాక్యం జ్ఞాపకం వచ్చి వారికి మీరు భారత ప్రజాస్వామ్య దేశానికి అధ్యక్షులు కావడం గాంధి గారి కల ఫలించింది అని వ్రాయగా, వారు నాకు సహృదయముతో జాబు పంపించారు. ఆ జాబునిందు ప్రచురించడమైనది. నా ఉత్తరం, దాని సమాధానం :

Dear Sree Narayana garu,

Please accept my heartiest congratulations on your assumption of charge as president, Indian Republic.

Your assumption of charge as president, Indian Republic

is a dream dreamt by Mahatma Gandhi Ji, as delivered on 2-10-1944, the day on which we have performed his Platinum Jubilee. His dream has since come true. Your dedication to the cause of pelple is also responsible for this honour.

May God bless you with long and healthy life to serve the nation.

దాని సమాధానముగా వారి జాబుకాపిని ఈ క్రింద ముద్రించడమైనది.



President

Republic of India

19th August, 1997

Dear Friend,

I thank you for your kind sentiments expressed on my assumption of office recently.

(sd/-)

(K.R. Narayanan)

To,

Sri. Mandali Rajagopal Rao,
Freedom Fighter,
President, Pensioners Association,
Puligadda, Avanigadda Mandal,

Dist. Krishna - 520 121.

నేను ది 22-11-1996 న దివంగత డా. మర్రి చెన్నారెడ్డి గారిని చివరిసారిగా వారింటివద్ద కలిశాను. వారు అప్పుడు తమిళనాడు గవర్నరు. ఇంటికి వచ్చారు. నేను షుమారు పది గంటలకు వారింటికి వెళ్ళాను, వారు ఒక్కరే టపాలు చూచుకొనుచున్నారు వెళ్ళండని వారి ఆఫీసు మెనేజరుగారన్నారు. నేను లోన ప్రవేశించి నమస్కారమన్నాను.కూర్చోండి అని ఏమిటి కవుర్లలన్నారు. టపా చూచుకుంటున్నారు గదా, డైవర్టు చేయడమెందుకని జవాబు చెప్పలేదు. చేతిలో ఉన్న కాగితం చదివి దాని మీద మినిట్సు వ్రాసి అక్కడ పెట్టి నా వంక చూసి కవుర్లేమిటండి అని అడిగినారు, మా వద్ద ఏముంటవండి అన్నాను. మరెవరి వద్ద అన్నారు. మీవద్దే అన్నాను. ఏమిటవి అన్నారు. The beginging of the end started with Tamilnadu అన్నాను. ఎలాగన్నారు. Are there traces for congress and AIDMK aliance at Tamilnadu. What if ? అన్నారు. It is the prophecy of Sir Winston Churchill అన్నాను . What is that prophecy అన్ని అన్నారు. Seeing Atlee the prime minister of England he said, Mr. Atlee, you want to give independence of India? Then power will go into the hands of rascles, rogues and free booters. Not even a glass of water or a loaf of breed will escape taxation only the air will be free and all these hungry millions will sit upon your head. They will fight among themselves and India will be lost in political squabbles. ఆ ప్రాఫెసీవిని, ధర హెచ్చుట తగ్గుట కొరకేగదా అన్నారు. అంటున్నారే గానీ మెటీరియలైజ్ కావడంలేదన్నాను. అది విని, లేదు మనకు మంచి రోజోలు వస్తునవి. The people of your type are required to the nation at this juncture, You will come to light, don't worry అని అన్నారు. నేనెందుకు వరీఅవుతానండి I don't want any seat of power అని సెలవు తీసుకొని పులిగడ్డ వచ్చాను. 2-12-1996 న బందరు కలెక్టరు ఆఫీసుకు వెళ్ళగా మీ చెన్నా రెడ్డిగారు

చనిపోయినారని చెప్పగా విని నివ్వెరపోయి హైదరాబాదు వెళ్ళితిని. ఖర్మ రోజున కూడా రమ్మని శశిధరరెడ్డిగారు చెప్పగా ఆ రోజున కుడా వెళ్ళి ఖర్మకాండలయిపోయాక భోజనము చేసి వచ్చితిని. ఇప్పటికీ అప్పుడ అప్పుడు వెళ్ళి శశిధర రెడ్డి గారిని కలుస్తుంటాను. ఈ సంవత్సరం జనవరి 13వ తేదిన వారి జన్మదిన సందర్భముగా మునిసిపల్ కార్పోరేషన్ వారు చెన్నారెడ్డి గారి జయంతి సందర్భంగా ఎర్పటు చేసిన రాక్ గార్డన్, ఇందిరాపార్కు వద్దకు వెళ్ళి కుమారులిద్దరికి కనబడి నాసింపతీని పంచుకొని వచ్చాను.

ఒకరోజు అవనిగడ్డ డిగ్రికాలేజి యానివర్సరీ జరుపు సందర్భములో ప్రిన్సిపాల్ శ్రీ చలపతిరావు గారు వారికి నాకు అదివరకు పరచయం కూడా లేదు. నేను స్వాతంత్ర్యసమరయోధుడనని తెలియగా నాకు ఆహ్వానము పంపిరి. ఆ ఆహ్వానము వచ్చిన సమయములో నేను గాంధిక్షేత్రం ఫౌండర్ ప్రశిడెంటుగారైన మండలి వెంకటకృష్ణారావు వద్ద ఉన్నాను. అదేమటని అడుగగా చదివి డిగ్రీకాలేజి ప్రిన్సిపాలుగారు పంపిన ఆహ్వానం అన్నాను. ఎప్పుడు యానివర్సరీ ఇంకొక అరగంటలోనేననగా వెళ్ళిరా అన్నారు. నేను వెళ్లేటప్పటికి డయాస్ మీద ఒక పోలీసు ఆఫీసరు ( D.S.P.) హాస్పటల్ సివిల్ సర్జన్, స్టేట్ బ్యాంకు మెనేజరు, ఎల్.ఐ.సి. మెనేజరు ఇంకా ఇద్దరు డిపార్టమెంటుల్ హెడ్స్ వారు ఉన్నారు. నన్ను లేక్చరర్స్ ముందువరుసలో వారిప్రక్కన కుర్చోబెట్టుకున్నారు. ప్రసంగం మొదలు పెట్టారు. అందరు మాట్లడిరి చివరకు ప్రిన్సిపాల్ గారు నన్ను చూస్తు పురప్రముఖులుగా రాజగోపాల గారిని మీరు వచ్చి మాట్లాడమని కోరుచున్నాను అనగా అన్‌ఎక్స్‌పెటెడ్ అనుకుంటు మైకు వద్దకువెళ్ళి సభకు నమస్కారాము చెప్పి సభకు వచ్చినవారంతా హైలీ ఎడ్యుకేటెడ్, డాకరేటు చేసినవారు ఉన్నారు. ఇంత హైలీ ఎడ్యుకేటెడ్ మీటింగులో నేను ఇదవరకెన్నడు మాట్లడలేదు ఐనా I didn't step in a college what can I speak before all these doctors yet I want ot speak in English that too on discipline Discilpline is not merely keeping quiet. It implies order. It shows the distinction of man without discipline man in a well fed animal. All ~~will~~ evils sprin~~k~~g out of indiscipline. Indisci-

pline makes a man devil. All progess depends upon discipline. a student requires discipline, a teacher requires discipline, a worker displine and a leader requres discipline. This discipline is much required in all kind of feilds progess cover stands still without discipline. A nation without discipline in unfit for freedom. Decmocracy cannot survy without discpline. It is the discipline that gives sence of our democracry our Freedom is slavery without discipline. If the father himself is dishonest he cannot turn out his children honest. The child is the father of a man. (నేటి బిడ్డ రేపటి తండ్రి). All the powers that are present in man were in him. When he was child but they were in an undeveloped stage. ఈ అవకాశము ఇచ్చిన ప్రిన్స్‌పాల్ గారికి దన్యవాదాలు చెప్పగా. నా నమస్కారము పెట్టె చేయిపట్టుకొని రాజుగోపాల్‌గారు నన్ను క్షమించండి నేను ఎమ్.ఏ., చదువుకొన్నాను, మీరు మా విద్యార్థులకు ఇచ్చిన స్పీచ్చి సందర్భోచితముగా పోలీషుడ్ ఇంగ్లుషిలో ఉన్నది. ఇంత పరిజ్ఞనం కలిగిన వారు ఈ గ్రామములో ఉన్నారా అన్నుకున్నాను. మీరు కాలేజిలో అడుగుపెట్టలెద్దన్నారు. ఆ నాటి ఇంగ్లీషు కాబోలు నేనైతే మాట్లాడ గలనుగాని, ఇలా అనర్గనంగా మాట్లడలేను. ఈ డయాస్‌మీద కూర్చునావారెవ్వరు ఇలా మాట్లాలేదు. అన్నీవున్నది అణిగే ఉంటుంది. ఏమిలేనిది ఏగిరిఏగిరి పడుతుంది అన్న సామెతను రుజువుచేశారు. నేను మిములను డయ్యాస్ మీదకు పిలువనందుకు నన్ను క్షమ్మించండి. అప్పుటి నుండి తరువాత ఆ డి.యస్.పి. గాని డయ్యాస్ మీద కూర్చున్నవారెవరైన నేను కనబడితే సమస్కారము చెప్పి ముందుకు సాగుతారు. ఒక రోజు హాస్పటల్ సివిల్ సర్జన్ గారు వారి పరివారముతో పార్క్ వద్దకు ఎదురు రాగా నమస్కరము చెప్పి మా హాస్పటల్ కు ఎప్పుడు రారెమండి అన్నారు. నాకే జబ్బులేదు ఇది మా తల్లిదండ్రుల ఆశిర్వచనము అనగా మీకు జబ్బు చేయలని మా హాస్పటల్‌కు రావాలని కాదండి. మీతో కొంతసేపు గడిపితే కొత్త విషయాలు తెలుసుకోగల్గుతానని

అన్నారు. మరేమీఅనుకోకండి అని వారి దారిని వారు వెళ్ళారు.

ఈ గాంధీ క్షేత్రానికి

(1) దివంగత మండలి వెంకట కృష్ణారావు గారు ఫౌండర్ ప్రెశిడెంటు.

(2) దివంగత ప్రభాకర్ జీ ఎక్జిక్యూటివ్ ప్రెశిడెంటు.

(3) దివంగత జయసింహాచారి వైస్ ప్రెశిడెంటు.

(4) శ్రీ కోట కేశవపెరుమాళ్ళు సెక్రెటరీ

(5) శ్రీ అన్నపరెడ్డి సత్యనారాయణ లలితకళాసమితి ప్రెసిడెంటు.

క్షేత్రములో ఈ దిగువ సంస్థలను ఎలాంటి అవక తవకలకు చోటివ్వకుండా ది. 1-9-1977 నుండి ది 31-3-1993 వరకు 16 సంవత్సరాలు పనిచేసి అంతరి మన్నలను పొందితిని.

| సంస్థపేర్లు | అధ్యక్షుల పేర్లు |
|---|---|
| 1) గాంధి క్షేత్రం కమిటీ | శ్రీ జయసింహ (కీ.శే. జేసికుమారప్ప అనుచరులు) |
| 2) ప్రభాకర్‌జీ దీనజనఫౌండేషన్ | శ్రీ అక్బర్ అలీ ఖాన్ (మాజీగవర్నరు) |
| 3)గాంధీయ యునైటెడ్ యాక్షన్ ఫర్‌రూరల్ డెవలప్‌మెంటు | శ్రీ కోదాటి నారాయణరావు |
| 4) దీనజన సంక్షేమ సమితి | శ్రీ ముక్కామల నాగభూషణం |
| 5) హిందీమహావిద్యాలయం | శ్రీ గద్దే బసవయ్య |
| 6) దివిసీమ లలితకళాసమితి | శ్రీ అన్నపరెడ్డి సత్యనారాయణ |
| 7) దివిసీమ వయోజనవిద్యాసమితి | శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి |
| 8) దివిసీమ మహిళా సేవాసంఘం | శ్రీ మతి గరికిపాటి దుర్గాంబ |
| 9) దివిసీమ వైజ్ఞానికి సాంఘిక సేవాసమితి | శ్రీ కోటకేశవ పెరుమాళ్ళు |
| 10) గ్రామీణయువజన వికాససమితి | శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ |

11) దివిసీమ రైతుసేవాసంఘము — శ్రీ అల్లపర్తి అన్నపూర్ణయ్య

12) దివిసీమ సాహితీ సమితి — శ్రీ కాపూరి వెంకట్రామయ్య చౌదరి

13) సద్గురు మహిళా సేవాసమితి — శ్రీమతి ముమ్మనేని ఝాన్సీరాణి

14) అదర్శ వివాహసంస్థ — శ్రీ బోగాది మాణిక్యా రావు

15) గాంధిక్షేత్రం పాలఉత్పత్తిదారుల సంఘం — శ్రీ కొత్తపల్లి ప్రసాదరావు

16) దివిసీమ బాలానంద సంఘం — శ్రీ మండలి బుద్ధ ప్రసాద్

17) జానపదకళల శిక్షణాకేంద్ర సంఘం — శ్రీ బి. ఆర్థర్‌పాల్

1972 సంవత్సరములో శ్రీమతి ఇందిరగారు స్వాతంత్ర్య సమర పోరాటములో పనిచేసిన వారికి జైలుకు వెళ్లకపోయినా రూల్సుమార్చి అట్టివారికి పెన్షను యిచ్చుటకు నోటిఫై చేసిరి. ఆ సందర్భములో నేను తాలూకా ఆఫీసులో అప్పర్‌డివిజన్ గుమస్తాగా ఉన్నాను. కొంతమంది నన్ను దరఖాస్తు చేయమనగా ఏదోఆశించి స్వాతంత్ర్య పోరాటములో పాల్గొనలేదుగదా. అయినా నేను ఉద్యోగము చేస్తున్నానని తిరస్కరించాను. తదుపరి 1987 నవంబరు నెల భారతప్రభుత్వమువారు ఒక నోటిఫికేషన్ ఈ క్రింది విధముగా యిచ్చిరి. ఆ నోటిఫికేషన్ శ్రీ జోస్యులసూర్యనారాయణమూర్తి గారు అను రిటైర్డు గవర్నమెంటు ఉద్యోగి, రేడియో ఆర్టిస్టు అనువారు మీకు పెన్షను వస్తుంది ఇదిగో నోటిఫికేషన్ అని చూపించినారు. నేను 1972 లోనే దరఖాస్తు చేసేవాడిని. ఇప్పుడెందుకు చేయాలి అనగా వారు గవర్నమెంటువారి నోటిఫికేషన్‌లో There were several people participated in Free India Struggle but some of them did not come out to light due to some reason or other. Now they may send their experience during freedom stuggle. అని ఉందిగదా గవర్నమెంటు వారే యిస్తానని

వస్తే మీదేమిపోయినది. అయినా మీరు ఆనాడు చేసిన పనులు వ్రాసి ఆల్‌యిండియా రేడియోకు పంపమనగా నేను ఆనాడు బ్రిటీష్ గవర్నమెంటును ఎదురించి స్వాతంత్ర్య సమర పోరాటములో చేసిన పనులు వ్రాసి పంపగా ది 31-1-1988వ తేదీన రాత్రి 8-00 గం॥ నా పేరుతో నేను చేసిన పనులను ఆల్ ఇండియా రేడియోలో ప్రసంగించారు. దాని ప్రకారం నేను దరఖస్తు చేయడానికి నమూనా ఫారమ్ దొరకలేదు. బందరు కళ్యాణి ప్రెస్‌లో ఒక చినిగిన స్టేట్ పెన్షను అప్లికేషను దొరికినది. దానిని పుర్తిచేసి పంపగా విచారించి నాకు 13-3-1995 న స్టేట్ పెన్షను గ్రాంటు చేసినారు. తరువాత సెంట్రల్ పెన్షనుకు దరఖాస్తు చేశాను. ఇంతవరకు ఆ దరఖాస్తుపై ఉత్తర్వులు ఇచ్చియుండలేదు. నాకు ఈ పెన్షను రావడానికి కూడా శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి గారిదే సలహా వారికి నా ధన్యవాదాలు.

## 12. నా జీవితవములో పెద్దల ప్రశంసలు :

ప్రభుత్వోద్యోగములో నా పనికి మెచ్చి పై అధికారులు యిచ్చిన ప్రశంసా పత్రాలు యిందు చివరగా ముద్రించబడినవి. తాలూకా ఆఫీసులో డేబుక్ క్లర్క్ గా చేస్తున్నప్పుడు పి.డబ్ల్యు.డి చెక్కులు, పంచాయితీల చెక్కులు, అన్ని ప్రభుత్వ శాఖల జీతాలు, టి.ఎ. బిల్లులు, ఎయిడెడ్ స్కూలు టీచర్స్ జీతాలు బిల్లులు మొదలైనవి నా బ్రాంచిలో ఉండేవి. ఒక నాడు ఎయిడెడ్ స్కూల్ టీచర్ కం మేనేజరు గారు పోతరాజు రామబ్రహ్మంగారు నన్ను మీలాంటి వారు 15% ఉంటే దేశం సుభిక్షంగా ఉంటుందన్నారు. ఒక తహసీల్‌దారుగారు నేజాయినయిన కొద్దిరోజులకే ఎలివేషన్ ప్రపోజల్ పంపించగా శ్రీ కరేటి సీతారామయ్యగారు మీ లాంటి రెవెన్యూ యిన్‌స్పెక్టర్లుంటే తహసీల్‌దార్లు తిరగవలసిన పనేముంటుందన్నారు.

అవిరెండవ ప్రపంచయుద్ధము జరిగే రోజులు. అర్థజీతము సర్టిఫికేటు కొరకు తహసీల్‌దార్ల వారివద్దకు వెళ్లగా వారి రెవెన్యూ ఇన్‌స్పెక్టరు దివంగత శ్రీ రాములు నాయుడు అనువారు

తాహసీల్‌దార్లవారి ఎదుటనే నాలంటివారినందరిని పిలిచి వార్‌ఫండ్ ఒక రూపాయి ఉన్నదా అనగా లేదని చెప్పితిని. నాలాగా రూపాయి లేనివారిని గుండెలలో చెయివేసితోసినారు. మేజస్ట్రేటు గారు కూడా అలాంటి సర్టిఫికేటు యివ్వవచ్చునని తెలిసి వారు ఇస్తారని చెప్పగా అప్పటి ఘనాపాటి (మెజస్ట్రేటు) గారి ఇంటిలో వుంటున్న శ్రీ రంగాచారి గారిని కలువగా ఈ దరఖాస్తు దారు ఎవరని అడుగగా నేనేనన్నాను. నీవు Vth ఫారం చదువుచున్నావా ? అని ఆశ్చర్యపడి అయితే నీవు మాకు ఏ డిప్యూటి కలెక్టరువో అవుతావు, ఎవరన్నా అడిగితే రూపాయి వార్‌ఫండ్ యిచ్చానని చెప్పు. వార్‌ఫండ్ లెకుండా సంతకం చేసియిస్తానని సంతకం చేసి నరసయ్య అనే జవానుకు యిచ్చి సీలు వేసి యిమ్మనగా సీలువేసి యిచ్చాడు. అడిగిన వాళ్ళకు మాత్రము రూపాయి వార్‌ఫండ యిచ్చే సర్టిఫికెటు తెచ్చుకున్నానని అబద్ధం చెప్పాను. ఆ నాటి (1939) రూపాయి (పదహారు అణాలు) విలువ ఇప్పటి 12,13 కిలోల బియ్యము ధరతో సమానముగా ఉండెడిది. అదే 1930 లో 16 అణాలకు 16 కిలోల బియ్యపు ధరగా ఉండెడిది. రాజకీయ నాయకులు దివంగత మర్రిచెన్నారెడ్డి గారు మీ లాంటి వారు పదివంది పరిపాలనలో ఉంటే భారతదేశము సుభిక్షంగా ఉంటుందన్నారు. గౌరవనీయులు శ్రీ టి. పురుషోత్తమరావు మాజీ మంత్రి వర్యులు మీకున్నంత రాజకీయ పరిజ్ఞానం మాకు లేదన్నారు. దివంగత వెంకట కృష్ణారావు, కోట్ల విజయభాస్కర రెడ్డి గారితో "Home for the disabled building" open చేసే సందర్భములో నన్ను ఈయన గాంధీక్షేత్రం మేనేజరు అనిన్నీ. ఈయనకు ఏదైనా పని అప్పగిస్తే ఆహార పానీయాలు అక్కరలేదండి అని చెప్పి వారిచేత ఒక శాలువా నాపై కప్పించి సత్కరంచారు. ఒక రోజు ఏదో సందర్భములో నీకు డబ్బు సంపాదించటం చేతకాదన్నారు. నేను డబ్బు మనిషిని కాదు. మాట మనిషిని మాత్రమే నన్నాను. నాకు ఉద్యోగ ధర్మములో ఆదికారులు యిచ్చిన ప్రశంశాపత్రాలను కొంతమంది రాజకీయ నాయకుల నుండి వచ్చిన ఉత్తరాలను, కొన్ని ఫోటోలను యిందులో చివరగా ముద్రించటమైనది. నా కుంటుంబ సభ్యుల, ఇతరులతో నేను కలిసి తీయించుకున్న ఫోటోలు యిందు ముద్రించడమైనది.

కుటుంబసభ్యుల వివరాలు :-

తండ్రి లక్ష్మయ్య తల్లి లక్ష్మీదేవమ్మల సంతానము

1) రాజగోపాలరావు - రాఘవమ్మ (భార్య)

2) గ్రంధి సీతారత్నం - గ్రంధి రామశాస్తుర్లు (బావ)

3) లేబాక కృష్ణమ్మ - లేబాక సబ్బారావు (బావమరిది)

4) మండలి వెంకట నరశింహారావు - మహాలక్ష్మి

5) ఇమడాబత్తుని అంకాలమ్మ - ఇమడాబత్తుని సత్యనారాయణ

**నాకుటుంబ సభ్యుల వివరాలు**

భార్య - మండలి రాఘవాంబ

| **కుమారులు** | **కోడళ్ళు** |
|---|---|
| 1) మండలి రమేష్‌బాబు ఎమ్.ఏ.బి.ఇడి. | - సాధనాల వెంకటరమణనాగభూషణరావు నాగవర్ధనమ్మల కుమార్తె పద్మావతీదేని బి.కామ్. |
| 2) మండలి వెంకట సత్యప్రసాద్ బి.ఏ.బి.ఎల్ | - ఇమ్మడి సత్యానారాయణమూర్తి - లక్ష్మీదేవమ్మల ద్వితీయ కుమార్తె భాను బ.ఎస్.సి. ఎమ్.ఇ.డి. బి.ఎల్. |
| 3) మండలి శేషగిరి, బి.ఏ., | - దేవనబోయిన కోటేశ్వరరావు కుమార్తె ఊర్మిళ, బి.ఏ., |
| 4) మండలి లక్ష్మిషణికుమార్, స్టెనో | - కుంటా నారాయణరావు జీజిబాయిల కుమార్తె రజినీ బి.కామ్. స్టెనో |

కుమార్తెలు　　　　అల్లుళ్లు

1) నాగమల్లేశ్వరి - ఇంకొల్లు నరసయ్య సుబ్బమ్మగార్ల తృతీయ పుత్రుడు పద్మనాభం. బి.ఏ.,

2) శేషదుర్గాంబ, బి.కామ్. బి.ఇ.డి. యడ్ల కృష్ణారావు తండ్రి అంజయ్య

3) లక్ష్మీప్రసూనాంబ. బి.ఏ. భోగాది సుబ్బారావు,హైమావతిల ద్వితీయ కుమారుడు బాలనాగేశ్వరరావు. బి.కామ్.,

నేను హోమియో వైద్య గ్రందాలు చదివి వైద్యవృత్తి కూడా చేసితినని ఇంతకుముందే తెలియజేసితిని. ఆరోగ్యంగా ఉండేందుకు మనిషి పాటించ వలసిన విధులకు తీసుకోవలసిన జాగ్రత్తలను వైద్యగ్రంధాలు మానవాళికి వివరంగా తెలియజేశాయి.

1) సంతోషం సగంబలం అన్న నగ్న సత్యాన్ని మరువకండి

2) మీరు నవ్వుతూ పదిమందిని నవ్విస్తూ మిచుట్టు ప్రక్కల వాతావరణాన్ని నవ్వుల మయం చేయండి.

3) ఉన్నంతలో తృప్తిగా జీవించటం అలవరచుకుంటే, ఆవేదన, ధుఃఖం, నిరాశ ఇవేవి మిమ్మల్ని తాకనైనా తాకలేవు.

అందుకే కాబోలు హోమియో వైద్య నిర్మాత దివంగత జర్మనీదేశస్తుడైన డా॥ హానిమన్ మహాశయుడు అన్న మాటలనిక్కడ పొందుపరచుచున్నాను.

ఎవనికైతే కోపములేదో, ఎవనికైతే యీర్ష్య లేదో, ఎవనికైతే దూరాశలేదో అట్టివానిదరికి ఏజబ్బు చేరలేదని వారువ్రాసిన హోనియో ఫిజియాలజిలో ఉన్నది. అది ముమ్మాటికి యదార్థమని నా అనుభవము వల్ల ఋజువగుచున్నది.

హోమియో వైద్యంతో నా వద్దకు రిక్తహస్తాలతో క్షీణించిన ఆరోగ్యముతో వచ్చిన అనేక మందికి వైద్యం చేసి పేరు గడించాను. ఒక రోజు గాంధీ క్షేత్రములోని ఒక కుక్కను ఎవరో తలపై నరికిరి. అది రక్తం కారుతూ ఏడుస్తోంది. అది కొత్తది అంటూ నిన్నెవరు నరికారే అని వైద్యం చేసి నడుముమీద చేయివేసి, నువ్విక్కడే ఉండు మందువేస్తానని

చెప్పి మందు తీసుకొని వెళ్ళి, రెండు బొట్లు ద్రావకం వేశాను. మంట పుట్టింది కాబోలు తలనిటునటు విదిలించింది. మరునాడు కూడ అదేవిధంగా మందువేశాను. రక్తం కారటం తగ్గి నొప్పికూడా తగ్గింది. అది మొదలు ఆ కుక్క నేనెక్కడున్నా నావద్దకు వచ్చి తోక ఆడించుచూ తన విశ్వాసాన్ని చుపేది. అందుకే కాబోలు The dog is a Faithful animal అని ఋజువు చేసుకొన్నది. నాశిష్యుడు జ్ఞాతి మండలి వెంకటసుబ్బారావు కంట్రాక్టరు తండ్రి వెంకట నరసింహం ఒకనాడు ఏదో సందర్భములో అన్నమాటలనిందు తెలియ పరచుచున్నాను.

అన్నయ్యా! నీవు Ship of the Desert (ఎడారి ఒడవు) మీరు చదువు చెప్పకముందు మన గ్రామములో S.S.L.C. Pass అయినవారు లేరు, ఇప్పుడు మీరు చెప్పినవారందరూ ఇంజనీర్లు, డాక్టర్లు, డిప్యూటీకలెక్టర్లు, ఉపాధ్యాయులు, లెక్చరర్లు, బ్యాంకు ఆఫీసర్లు, ఇలా అనేకానేక ఉద్యోగాలు చేసి కొంతమంది రిటైరైనారు. ప్రతి ఫలము నేనేమి యివ్వలేదు. ఎవరేదియిచ్చినా తీసుకొన్నావు గాని మారు అడిగినట్లు లేదు. వేరేగవర్నమెంటు జీతములేదు. నెలకొకరూపాయి యిచ్చినా తీసుకోన్నట్లు గుర్తు అని నుడివినాడని తెలియ జేయుచున్నాను. యీయన ది॥ 28-4-2001 న పులిగడ్డలోనే హటాన్మరణము పాలైనందువలన చింతించాను వారి కుంటుంబ సభ్యులకు నా ప్రగాఢ సంతాపాన్నిలందిచాను.

నా తమ్ముని అవసానదశలో కుమారుడు 4 సంవత్సరాల వయస్సు కలిగిన సత్యప్రసాద్‌ను పిలిచి మా మేనాకోడలి సమక్షములో నీవు ఎవరిమాటా వినసద్దు పెదనాన్నమాట తప్ప. ఐనా ఇతరులమాట విన్నావో నీకే మిదక్కదన్నాడని నా మేనకోడలు లేబాక ఉర్మిళ అన్నమాటలు. అదేప్రకారం ఇప్పటికి తండ్రి మాటను నిలబెట్టు కుంటున్నాడు. నా కుమారులలో ఒకడిగా నడుచుకుంటున్నాడు.

ఒక రోజు నేను రిటైరైన షుమారు పది సంవత్సరములకు నా కుమారులలో ఒకడు మీరు ఎప్పుడు సత్యము, అహింస అని జపము చేస్తూ ఉంటాడు. సత్యాన్ని నమ్ముకున్న హరిశ్చంద్రుడేవితిన్నాడు. భార్యబిడ్డలనమ్ముకొన్నాడు, తానుఅమ్ముడుపోయి

